# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.

సంపాదకుడు :
ఆండ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట : ౫.    ఈశ్వర, ఆషాఢము : జూలై, 1937.    సంచిక : ౧౨.


## సంపాదకీయసమాలోచన

**• మఱియొక మెట్టు ఎక్కుచున్నాము :—**

ప్రేమస్వరూపుడగు భగవానుని అనుగ్రహమువలనను, పెద్దల ఆశీర్వాదబలమునను ఈసంచికతో ఆంధ్రభూమి నిర్విఘ్నముగ ఐదవ సంపుటమును ముగించుకొనుచున్నది. ఇన్నినాళ్లుగ దీనిని పెంచి పోషించుచువచ్చిన చందాదారులను, ఏజెంట్లను, ప్రకటనకర్తలను ఈ సంతోషసమయమున కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచున్నాము. ఇకముందును వారల పోషణప్రోత్సాహములను ఆంధ్రభూమి అర్థించుచున్నది. భగవానుడు అనుగ్రహింపజేయునుగాక !

**• ఈసంచిక ముఖపత్రచిత్రము :—**

ఆంధ్రభూమి పాఠకులకు చిరపరిచితులయిన చిత్రకారులు శ్రీయుత శ్రీపాద దుర్గారావుగారు రచించినది. మారువాడీకాంతల వేషభంగిని నిరూపించు ఈచిత్రము రావుగారు ఇటీవల చిత్రించినది. ఆంధ్రభూమికి ఆమడల దూరముననున్న బొంబాయిమహానగరమున క్షణము తీరికయుండని వృత్తియందుండియు ఆంధ్రభూమికి యథారీతిని చిత్రములను బంప కుతూహలపడుచున్న రావుగారి ఆంధ్రాభిమానమునకు సంపాదకునితోబాటు ఆంధ్రభూమి పాఠకులెల్లరును ఆనందింపగలరని నమ్ముచున్నాము.

**• భారతీయులకిదియొక సంతోషవార్త :—**

ఏటేట అమెరికాయందలి పత్రికా సంపాదకులలో అగ్రస్థానము వహించినవారికి బహుమతి నొసంగు ఆచారముగలదు. ఈయేడు ఆ బహుమానమును భారతీయుడగు శ్రీ గోవింద బేహారిలాలుగారు బడసిరి. విదేశమున విజాతీయభాషలో పత్రికను సమర్థతో నిర్వహించుటయేగాక ఆదేశపుసంపాదకులందరికిని అగ్రసరుడగుట నిజముగ ఆశ్చర్యకరమైన విషయము. ఇట్టి ప్రజ్ఞామతుల మూలముననే భారతకీర్తి ఖండాంతరములందు ఖ్యాతమగుచున్నది.

౯. బొంబాయిలో ఆంధ్రవిద్యార్థుల అగచాట్లు:—

ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి ఈ విషయమునుగూర్చి వ్రాసిన క్రింది వాక్యములు ఆంధ్రుల అలసత్వమును ప్రస్ఫుటము చేయుచున్నవి: "...చిన్న చిన్న తరగతులలో చేరవలసిన ఆంధ్ర బాలబాలికల విషయమై వసతులు చాల తక్కువ. ఇష్టములేకున్నను మతూంగాలో తమిళులచేతను, మళయాళీలచేతను నడుపబడే దాక్షిణాత్యుల విద్యాలయానికి పంపటం తప్పని సరియైంది. అచ్చట తెలుగువాచకాలు వారానికి రెండుపర్యాయములు మాత్రమే బోధింపబడును." ఇట్టి పరిస్థితులలో కొద్దికాలముననే బొంబాయియందలి ఆంధ్రులలో ఆంధ్రము నశించిపోవుననుట నిశ్చయము. ఇది కొరతగిన విషయమేనా?

౧౦. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణము:—

మొన్న నంద్యాలలో జరిగిన ఆంధ్రరాష్ట్రీయసభలో ఇందు విషయమై ఒక తీరుమానము చేయబడినది. కాని ఆ తీరుమానము నందుకొని కార్యకలాపము నిర్వర్తించుటకు ఎట్టి ఏర్పాటును గావింపబడలేదు. మన నాయకులకు తలకొక వ్యాపారమును తలకు తగిలియున్నది. రామదాసుపంతులుగారికి సహకారోద్యమము, పట్టాభిసీతారామయ్యగారికి ఇన్సూరెన్సు యుద్యమము, గిరిగారికి కార్మికోద్యమము, రంగాగారికి కర్షకోద్యమము, సాంబమూర్తిగారికి శిష్యులను శిష్యురాండ్రను అభ్యుద్ధరించు యుద్యమము. ఇక రాష్ట్రోద్యమము మాట తలపెట్టువారెవరు? సభాధ్యక్షులగు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు తమ అధ్యక్షోపన్యాసమున 'దీనినిగూర్చి అవకాశము చేకూరినవెంటనే శాసనసభలోను, బయటను ఆందోళనజరిపి అచిరకాలములో మనము మనరాష్ట్రమును విడదీసుకుంటేనే తప్ప మన అభివృద్ధికి అనేకమైన ఇబ్బందులు కలుగును' అని చెప్పినారు. కాని ఆ అవకాశము ఎప్పటికి చేకూరునో?

౧౧. ఆంధ్రరాష్ట్రమున రైతరక్షణయాత్ర:—

ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాధ్యక్షులయిన కొమ్మారెడ్డి సత్యనారాయణగారి యాజమాన్యమున ఆంధ్రదేశమునందంతటను విశాఖపట్టణము జిల్లానుండి మదరాసువరకు కాలినడకను ఈనాటినుండి సాగింపబడుచున్న రైతురక్షణయాత్ర రైతాంగమున గొప్ప సంచలనము గావింపగలుగుట నిశ్చయము. ఇట్టి యాత్రలవలన రైతాంగమున సాముదాయకముగ ఉత్సాహశక్తి దీప్తమగును. రైతుబాగే దేశముయొక్క బాగు కావున ఆంధ్రులెల్లరు ఈ రైతురక్షణయాత్ర దిగ్విజయముగ సాగుటకు తోడుపడుదురుగాక!

౧౨. రాజప్రతినిధిప్రకటన:—

'పలకరా పలకరా బంగారుతండ్రీ' అని అనిపించుకొని ఎట్టకేలకు రాజప్రతినిధి పలికిన పలుకు అనుకున్నంత ఆశాజనకముగ లేదు. వాక్యములు మాధుర్యమును ఉద్గారిత మొనర్చుచున్నవి, సామరస్యమును వెలిగ్రక్కుచున్నవి. ఇన్నినాళ్లుగ నడచిన చర్చలను సమన్వయము చేయుచున్నదేకాని రాజప్రతినిధి ప్రకటన కొత్తవెలుగును ఏమియు చూపుటలేదు. ఈ ప్రక

టనకు ఆలస్యదోషమొకటి పట్టినదని అంగీకరింపక తీరదు. అధికారము స్వీకరించుటతోడనే అతడు గావించిన ప్రకటన వలన గలిగిన ఆశలు ఒకటికూడ నెరవేరలేదు. ఈప్రకటనయు దానిదారిని బట్టకుండుట కాంగ్రెస్‌వారి చిత్తముపై ఆధారపడియున్నది.

### ౯. కీ. శే. పండిత గానాల రామమూర్తి గారు :—

గోదావరిపత్రిక, న్యాయదీపిక, సమదర్శిని మున్నగు తెనుగు పత్రికలను సమర్థతతో నిర్వహించిన పండిత గానాల రామమూర్తిగారి మరణము ఆంధ్రవిశ్వబ్రాహ్మణసంఘమునకును అందుమూలమున ఆంధ్రసంఘమునకును గొప్ప కొరతను ఏర్పఱచునదిగానున్నది. ఆయన ఉపన్యాసకుడు, పత్రికాసంపాదకుడు. అగుటనే ఆయన సంపాదకీయవ్యాసములు ఉపన్యాసధోరణిలోను, ఉపన్యాసములు సంపాదకీయవ్యాసములవలెను ఉండుచు విచిత్ర మర్యాదతో ఒప్పునవి. ఆయన మదరాసు శాసనసభలో సభ్యుడై తనదృష్టిలో ఉచితమనుకొన్న రీతిని సంఘసేవ, దేశసేవ చేసినాడు. ఆంధ్రులలో తెలుగు జర్నలిజము మూలమున పైకి వచ్చిన వారిలో గానాల రామమూర్తిగారు మొదట పేర్కొనదగిన వారని అంగీకరింపక తీరదు. వారి ఆత్మకు శాంతికలుగుగాక!

### ౯. కీ. శే. కొంపెల్ల జనార్ధనరావు గారు:—

తెనుగువారి మాసపత్రికలలో మాణిక్యమనదగిన 'భారతి' కార్యాలయమున శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారి విశిష్టపరిశీలనమున బహువారములు తరిఫీతునొంది స్వతంత్రుడై 'ఉదయిని' అను ఉత్తమమాసపత్రికను స్థాపించి ఆహాపుట్టునట్లు ఒక సంపుటమును నిర్వహించిన మామిత్రులు కొంపెల్ల జనార్ధనరావుగారు అకాలమరణము వాతబడిరని తెలుపుటకు మిక్కిలి విచారించుచున్నాము. రావుగారు ఋషిజీవనులు. ఆయననోటివెంట ఎన్నడును పరుషవాక్యము వచ్చుట మేము ఎఱుంగము. 'ఉదయిని' కొఱకే ఆయన జీవితము ధారపోయబడినది. 'ఉదయిని'కి అందచందమును కూర్చుటలో ఆయన తన ఆరోగ్యమును ఏమరినాడు. మూడు పదులైనను నిండకపూర్వమే ఆయనకు నూరేండ్లు నిండినవి. ఆయన ఆత్మకు శాంతినిగోరి భగవానుని ప్రార్థించుచున్నాము.

### ౯. భారత శాసన సభా సభ్యులకు జీతములు :—

భారతశాసనసభాసభ్యులకు ప్రయాణపు బత్తేములను, సభజరుగు దినములలో దిన వెచ్చములనుగాక ఏడాదికి ఇంతఅని జీతమును ఏర్పాటుచేయవలెనను వాదము నొక దానిని సత్యమూర్తి అయ్యంగారు లేవదీసినారు. ఇతర దేశములందు శాసనసభాసభ్యులకు జీతములిచ్చు ఆచారము ఉన్నది. ఏడాదికి శాసనసభాసభ్యులకు గ్రేటు బ్రిటనులో 400 పౌనులు, కెనడాలో 800 పౌనులు, ఆస్ట్రేలియాలో 850 పౌనులు, న్యూజిలాండులో 450 పౌనులు, సౌత్ ఆఫ్రికాలో 400 పౌనులు, దక్షిణ రోడీషియాలో 300 పౌనులు, యునైటెడ్ స్టేట్సులో 1500 పౌనులు, ఫ్రాన్సులో 500 పౌనులు, హాలెండు బెల్జియమ్ దేశములలో 420 పౌనులు, నార్వేలో 300 పౌనులు ఇచ్చుచున్నారు. అయితే ఈపద్ధతి భారతదేశమున ప్రవేశ

పెట్టుట ఎంతవఱకు వాంఛనీయమనునది ఒకసమస్య. మనది మిక్కిలి పేదదేశము. అసలే రాజ్యాంగము అధికవ్యయకారణముగానున్నది. పన్నులభార మొకటి దుర్భరమైయున్నది. ఇట్టి పరిస్థితులలో ఈనూతనవ్యయమును కోరుట ఉచితముకాదు. సభ్యులకు జీతములిచ్చుట ఏర్పడుచో వ్యయభార మతిశయించి ఇకముందు ఎలక్టరేటును విశాలపఱిచి ప్రతినిధుల సంఖ్యను హెచ్చించుటకుకూడ ఒక నిరోధము ఏర్పడవచ్చును. ఎన్నిరీతుల చూచినను శాసన సభాసభ్యులు జీతగాళ్ళగుటకంటె గౌరవసభ్యులై యుండుటయే వరణీయముగానున్నది.

౯. కీ. శే. సర్ గోవిందకృష్ణ యాచేంద్ర బహదూర్ :—

వెంకటగిరి సంస్థానాధీశ్వరులగు మహారాజా సర్ వెలుగోటి గోవిందకృష్ణయాచేంద్ర బహదూర్‌వారు జూన్ నెల 16–వ తేదీని బెంగుళూరులో మరణించిరి. తమ ముప్పదియెనిమిదవయేట 1917–వ సంవత్సరమున శ్రీవారు సంస్థానాధిపత్యమును వహించిరి. రాజభక్తి ప్రదర్శించుటకు, కుటుంబమర్యాద నిలుపుటకు చేసిన దానములుమాత్రమేకాక శ్రీవారు వైద్యసంస్థలను, విద్యాసంస్థలను పోషించి యథామతిని ప్రజాసేవ గావించిరి. వీరి మరణము వలన ఆంధ్రమాత శాంతిప్రియత్వము దయామయత్వముగల పెద్దతరపు జమీందారులలో నొకరిని గోల్పోయినదని చెప్పవలసియున్నది. శ్రీవారి ఆత్మకు శాంతి కలుగునుగాక!

౯. చేమగ్గముల నేతపరిశ్రమ: రామదాసుపంతులుగారి హితబోధ:—

19–6–37–వ తేదీని నంద్యాలలో జరిగిన చేమగ్గముల నేతపనివాండ్ల మహాసభను ఉపక్రమించుచు గా. వేమవరపు రామదాసుపంతులుగారుగావించిన క్రింది హితబోధ అవశ్యముగ గైకొనదగినదై యున్నది: 'చేమగ్గముల నేతపరిశ్రమను ప్రోత్సహించుటకు ప్రభుత్వమువారి కొన్ని వ్యవహారశాఖలలోను, ప్రభుత్వాదరణగల సంస్థలయందును, రైల్వేశాఖలయందును, జిల్లాబోర్డులందును, మ్యునిసిపాలిటీలందును స్వదేశీమిల్లుగుడ్డకంటె చేమగ్గముల వస్త్రములనే ఎక్కువగా అభిమానించుట చాలా ప్రయోజనకరమైయుండును.' చేమగ్గముల నేతపరిశ్రమ ముఖ్యమైనగ్రామపరిశ్రమ. దాని అభివృద్ధికి తోడ్పడుట గ్రామసౌభాగ్యమునకు తోడుపడుటయేయగును.

౯. ఆంధ్రులకు శ్రీ రాజగోపాలాచారిగారి హితోపదేశము :—

పదునారవ ఆంధ్రరాష్ట్రీయసభకు ప్రారంభోత్సవము జరుపుచు మదరాసు కాంగ్రెస్ నాయకమణి శ్రీరాజగోపాలాచారిగారు ఆంధ్రులను హెచ్చరించుచు ఆచరణయందు పెట్టజాలని తీరుమానములను చేయరాదనిరి. ఈయేటి ఆంధ్రసభలలోచేసిన తీరుమానముల విషయమున ఆంధ్రులీ హితోపదేశమునందలి మేలు ఎంతవఱకు గ్రహించి ఆచరింతురో చూడవలసియున్నది.

౯. మొసలికంటి తిరుమలరావుగారిని ఎన్నుకొనుడు :—

పూర్వవృత్తము ఎట్టిదగుగాక! ఇక దానిని విస్మరించి సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో కృష్ణా గోదావరిజిల్లాల స్థానమునకు శ్రీయుత మొసలికంటి తిరుమలరావుగారిని

ఎన్నుకొనవలసియున్నది. విద్యావంతులును, కాంగ్రెస్ భక్తులును అగు కృష్ణా గోదావరి జిల్లాల ఓటర్లు తమవిధిని సక్రమముగ నిర్వర్తింతురుగాక ! ప్రకాశముపంతులు, రామచంద్రరావుపంతులు మున్నగు ఆంధ్రమహాశయులచే లోగడ అలంకరింపబడిన ఈస్థానముయొక్క దీప్తిని తిరుమలరావుగారిపుడు నిలపవలసియుందురు. వారికి జయమగుగాక అని కోరెదము.

౬. ఆంధ్ర ప్రజాసామాన్యముయొక్క ఆర్థిక స్థితిగతులు :—

మొన్నటి ఆంధ్రరాష్ట్ర మహాసభ తీరుమానములలో ఆంధ్రరాష్ట్రమునందన్ని జిల్లాలలోను ప్రజాసామాన్యముయొక్క ఆర్థికస్థితిగతులను గురించి సమగ్రమైన విచారణ జరిపి తగు సంజాయిషీ తీసికొని రిపోర్టు ప్రచురించుటకు ఉపసంఘమును నియమింపవలెనను నది ముఖ్యమైనదని మాతలంపు. కొన్ని తెనుగు గ్రామముల ఆర్థిక స్థితిగతులను విచారించి ఆచార్య రంగాగారు లోగడ ఆంగ్లమున ప్రచురించియున్నారు. ఇప్పటి ఈ విచారణమును వారి యాజమాన్యమున జరుపుట ప్రయోజనకారిగ నుండును. ఈ విచారణావసరమున శ్రీయుతులు వేమవరపు రామదాసు పంతులు, భోగరాజు పట్టాభిసీతారామయ్యగారల సలహా అమూల్యముగ నుండగలదు. ఉపసంఘము వెంటనే నియమింపబడి కార్యకలాపమునకు గడంగుట వాంఛనీయము.

---

## 40 ఔన్సుల నెత్తురు

40 ఔన్సుల రక్తమునుండి కాని ఒక ఔన్సు శుక్లము ఉత్పత్తి కాదని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. దీనినిబట్టి శుక్లము ఎంత విలువ యైనదో తెలిసికొనవచ్చును. అట్టి శుక్లము మూత్రములోగాని, స్వప్నములోగాని పోవుచున్నచో ఇక పురుషునకు ఇహలోక సుఖమెక్కడ? కాబట్టి సుఖానందములపై దృష్టియున్నచో

### శుక్లనష్టమును

ఎంతమాత్రమును అశ్రద్ధచేయక వెంటనే చికిత్సచేసి శుక్లరక్షణము గావించుకొనవలయును. పలుచబడిన వీర్యమును గట్టిపఱచి అధికముగా వీర్యవృద్ధిని కలిగించు వనమూలికలకు రాజైన రత్నపురుష

ప్రధానద్రవ్యముగా చేయబడిన

# రత్నపురుషలేహ్యము

క్రమముగా సేవించుటచే తప్పక శుక్లరక్షణము జరుగును. మరియు ఈరత్నపురుష లేహ్యసేవనమువలన

కండపుష్టి : కాయపుష్టి
బలము : ఆరోగ్యము
శరీరబింకం : జీవితసౌఖ్యం

పొందుదురు. రత్నపురుషతో అమోఘవీర్యములగు పెక్కు ఇతర వనమూలికలుచేర్చి తయారుచేయబడిన తియ్యని రసాయనము, శుక్లనష్టమును సూటిగ కుదుర్చు మధురమగు మందు. మేహరోగుల పాలిటి వరప్రసాదము.

నెలకు ఒక పౌను. వెల రూ. 3-0-0. తపాలాఖర్చులు ప్రత్యేకము.

రత్నపురుష డిపో,
2/40 పెద్దినాయునివీధి,
మదరాసు.




దినానికి ఎన్నిమారులు భోజనంచేస్తే అన్ని మారులు విరేచనం అవడం ఆరోగ్యలక్షణం.

... ... ...

ప్రతిదినం భోజనానికి పూర్వం కొద్దిగా వేడినీటిని త్రాగుతూవుంటే మలబద్ధకం పోతుంది.

... ... ...

నారింజపండ్ల రసములో లోహము ఉంది.

... ... ...

పాలలో సున్నము ఎక్కువగా వున్నది.

... ... ...

పుప్పిపంటివ్యాధికి ముఖ్యకారణం విటమినులు లేని ఆహారంతినడమే.

... ... ...

రాచఉసిరిక, పెద్దఉసిరిక పండ్లలో మలవిరేచనంచేసే పిప్పిపదార్థం విస్తరించివుంది.

... ... ...

గోంగూరను చిమడ ఉడకపెట్టడంవల్ల దాని యొక్క దుర్గుణం మరింత హెచ్చుతుంది.

... ... ...

అతిమూత్రరోగులు వెన్న, మీగడలను వాడరాదు.

... ... ...

పాడివగ్గు వున్నవారికి బియ్యపుకడుగు చాలా మేలు చేస్తుంది.

... ... ...

కూరగాయలమీద చెక్కును తీసివేయకుండా వండుకొనితినాలి.

... ... ...

బంగాళాదుంప పచ్చిది జీర్ణంకావడానికి 10 గంటలు పడుతుంది. వండిన బంగాళాదుంప 5 గంటలకాలంలోనే జీర్ణమౌతుంది.

నారింజపండులోకంటె బత్తాయి నారింజలో ఎక్కువ పోషకద్రవ్యాలున్నాయి.

... ... ...

గడ్డకట్టిన కఫాన్ని కరగించి వెలువరించడంలో కమలాఫలాలు సాటిలేనివి.

... ... ...

మూర్ఛారకుడైన రోగిని వెల్లకిల పడుకోబెట్టి దేహంకన్న తల పల్లంగావుండేటట్లు చూడాలి.

... ... ...

వడదెబ్బ తగిలినవానికి ముచ్చిలిగుంటమీద వేడి నీటితో కాపడం చేయడం మంచిది.

... ... ...

మూత్రము 10 మొదలు 12 గంటలకు మించి మూత్రాశయంలో నిలవయుండరాదు.

... ... ...

మాంసకృత్తులు, కొవ్వు విశేషంగావున్న కాయ కూరలో చిక్కుడుప్రధానమైంది.

... ... ...

కర్బూర చక్కెరకేళి తెల్లచక్కెరకేళికంటె తేలికగా జీర్ణమౌతుంది.

... ... ...

బొంతఅరటికాయలోని పిండిపదార్థం చాలా కష్టంమీద జీర్ణమౌతుంది.

... ... ...

కోకో పానీయములో థియొబ్రోమిన్ అను విషమున్నది.

... ... ...

సామాన్యమైన ఆహారాన్ని తినేవారందరూ దినానికి 1,2 సేర్ల నీటినితాగాలి.

'ప్రకృతి గృహవైద్యము'నుండి.

# కారపుశనగలు

మొన్న నంద్యాలలో జరిగిన 16-వ ఆంధ్రరాష్ట్రీయ సభకు అరవ అయ్యంగారు రాజగోపాలాచారి ప్రారంభోత్సవం జరిపేడు. ఇట్లు ఆంధ్రసభకు అరవవాడు పురోహితుడుగా వరింపబడ్డానికి కారణాల్లో ముందు ఏర్పడబోయే మంత్రిపదవులవైష్ణవం కూడా ఒకటైవుంటుందా?

... ... ...

ఆంధ్రసభలో తనకు వేయబోయే పూలదండను పుచ్చుకొని రాజగోపాలాచారి అప్పటికి తనకు ఎదురుగుండా వస్తూన్న మహర్షి సాంబమూర్తి మెడలో వేశాడు. వెంటనే సాంబమూర్తి దాన్ని తీసి రాజగోపాలాచారి మెడలో వేశాడు. అటు రాజగోపాలుడికి ఇటు సాంబమూర్తికి ఏర్పడ్డ ఈ పూలదండదాంపత్యం రేపుమంత్రివర్గ్యమహోత్సవంజరిగేసరికి విడాకుల్లోకివచ్చి తీరుతుందని నారదవార్త.

... ... ...

ఆంధ్రరాష్ట్రవిషయంలో తమ అధ్యక్షోపన్యాసంలో ప్రస్తావిస్తూ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు 'శ్రీమాన్ రాజగోపాలచార్యులుగారు మన ఉద్యమమునకు ఎంతయు సుముఖులని మనకు తెలియును. వారియొక్క తోడ్పాటులో మనకు అచిరకాలములోనే జయముకల్గునని మనకు సందేహము లేదు' అన్నారు. అంటే కాఫీగతప్రాణిఅయిన ఆంధ్రుడికి తమ హోటళ్లలో ప్రతిరోజు ఇంత కాఫీ పోసి రక్షిస్తూవున్న అరవజాతికి చెందిన రాజగోపాలాచారిగారే మనకు ఆంధ్రరాష్ట్రం సంపాదించి పెడతారన్న మాట. అరవకాఫీ ఆంధ్రులికి బాగావంటబట్టిందనడానికి ఇంతకంటె ఏమేనా నిదర్శనంకావాలా?

... ... ...

నంద్యాలసభల్లో ఫలహారంసమయంలో ఒకనాడు పట్టాభిసీతారామయ్యగారు ఇమ్యూనిటీప్రాశస్త్యాన్ని గూర్చి ఉపన్యసిస్తుండగా వారికళ్లజోడు పోయిందిట. ఆకళ్ళజోడును ఇంకా పట్టాభిగారు భీమాచేసి యుండని కారణంచేత దాన్ని పోగొట్టుకోడానికి ఇష్టంలేక ఆయనఆకళ్లజోడు కాంప్లికేటెడ్ లెన్సుది; దాన్ని ఉపయోగించిన వాడికళ్లు చెడిపోతాయి అంటూశాపంపెట్టారట. పట్టాభిగారికి అణాపైసల అతిజాగ్రత్త మనిషిఅనేపేరు ఊరికే రాలేదనడానికి ఇదో నిదర్శనం.

... ... ...

ఈ యేటి ఆంధ్రసభల్లో కాఫీ యేమీ బాగాలేదని అందరూ అంటున్నారు. కాఫీ తయారుచెయ్యడంలో ఖండాంతరఖ్యాతికాంచిన అరవజాతికి చెందిన రాజగోపాలాచారి ఖద్దునఉండి కూడా కాఫీ విషయంలో ఆంధ్రులికి దిద్దుబాటు చెప్పకపోవడం తనజాతివారి వ్యాపారరహస్యం వెల్లడిచెయ్యడం ఇష్టంలేకనే అని అనుకోవచ్చునా?

... ... ...

ఒకయిల్లాలు తనభర్త 20 సంవత్సరాలుగా సిగరెట్లు కాలుస్తున్నాడనీ, రోజుకు సగటున 15 సిగరెట్లచొప్పున ఇంతవరకు మొత్తం 1,09,500 సిగరెట్లు కాల్చాడనీ, వీటిని వరసగా పరిస్తే 6 మైళ్లపొడవు వుంటుందనీ, 278 పౌనులఖరీదు అనీ, ఒక్కొక్క సిగరెట్టుకు ఒక అగ్గిపుల్లవంతున 2184 అగ్గిపెట్టెలు తగలేశాడనీ లెక్కలు తేల్చింది. మాపురోహితుడి భార్య తనమగడు ముడివేయించిన మంగళసూత్రాలన్నీ ఒకచోటచేర్చి తూలిస్తే మూడుసంచాలికి మించి వుంటాయని వెనక ఎప్పుడో అన్నముక్కలు పై ఇల్లాలి అంచనా విన్నతరవాత జ్ఞాపకానికి వస్తున్నాయి.

—వి. విశ్వనాథము, బి. ఏ.

# సర్ హెన్రీ డబ్లు. ఎ. డిటర్ డింగ్

125 నూనె కంపెనీలయజమాని. 15000000 పౌనులిచ్చి ప్రత్యర్థిని తొల గించినాడు. ఆసియా, ఐరోపాల రాక్ ఫెల్లరు.

ఈ సంవత్సరము మే 23-వ తేదీని చని పోయిన జాన్ డేవిసన్ రాక్ ఫెల్లర్ అమెరికాఖండపు నూనెరాజు. అతని చరిత్ర ఆంధ్ర భూమి పాఠకులకు చిరపరిచితమైనది. అసియా ఐరోపాఖండముల నూనెరాజు అనదగినవాడు సర్ హెన్రీ డబ్లు.ఎ. డిటర్ డింగ్. ఈడిటర్ డింగ్‌ను అసియా ఐరోపాఖండముల రాక్ ఫెల్లర్ అనవచ్చును. ఇతనిచరిత్ర ఇచ్చట ప్రస్తరింపబడుచున్నది.

సర్ హెన్రీ డబ్లు. ఎ. డిటర్ డింగ్ డచ్చి జాతికి చెందినవాడు. ఇతర డచ్చిజాతీయుల వలె ఇతడును తెలివైనవాడు, ఒడలు దాచు కొనక పనిచేయువాడు.

రాయల్ డచ్ షెల్ మెక్సు ఆయిల్ కాం బినేషన్‌కు సర్ హెన్రీ డబ్లు. ఎ. డిటర్ డింగ్ అధ్యక్షమహాశయుడు.

సర్ హెన్రీ ఇపుడు ఆంగ్లదేశమున స్థిర పడిపోయినాడు. యూర్ ఆసియాఖండముల రాక్ ఫెల్లర్ యితడు. సర్ హెన్రీ ప్రస్తుతము నూట ఇరువదియైదు నూనెకంపెనీలకు యజమానియై యున్నాడు.

ప్రపంచమునందలి నేటి మొదటి పంద్రెండుగురు వర్తకశిఖామణులలో సర్ హెన్రీ ఒకడు. అగుగాక! జీవితము ప్రారంభించు సరికి ఇతనివద్ద ఎట్టి డబ్బుకాని లేదు, ఇతనికి ఎట్టి స్నేహితులుకానిలేరు, ఇతర సౌకర్యములు ఎట్టివికాని ఇతనికి లేకుండెను. ఆదినములలో సర్ హెన్రీకి ఉన్న ఆస్తి అంతేయు పట్టుదల మున్నగు సుగుణములుమాత్రమే.

హెన్రీ పుట్టుక ఎక్కడ? ఆమ్‌స్టెర్ డమ్‌లో ఒకానొక మారుమూలవీధిలో.

ఇతని తండ్రికి ఏమిఉద్యోగము? విశేష మగు జీతములేని కప్తాను ఉద్యోగము.

ఇంతకును హెన్రీ మొదటిఉద్యోగమేమి? ఒకబ్యాంకులో ఉత్తరములు వర్తమానములు కొనిపోయి కొనివచ్చుపని.

అయితే జీవితమున ఇతనికి ప్రథమావకాశము ఎట్లుకలిగినది? అభివృద్ధినందవలయునను తీవ్రకాంక్షలో చేయుచున్నపనిని కాలితో తన్నిపోవుటచేత.

ఇరువదిరెండేండ్లు నిండువఱకును హెన్రీ బ్యాంకులోని ఉద్యోగమునే అంటిపెట్టుకుని ఉన్నాడు. అప్పటికి ఇతనికి తెలిసివచ్చినది తన పరిశ్రమకు, ప్రతిభకు ఆబ్యాంకు కార్యాలయము చాల సంకుచితమైనదని. తాను స్వయముగ విశేష వ్యాపారమును సాగింపగలనని హెన్రీకి తోచినది.

తోచుట తడువుగా నితడు ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చినాడు. నెధర్లాండ్సు ట్రేడింగు సొసైటీ పూర్వపు ఈస్టిండియా కంపెనీవంటిది.

అపుడు ఉద్యోగరీత్యా ఇతనిని డచ్చి వలస రాజ్యములకు బంపిరి. ఇతడు అప్పుడు జూనియర్ క్లార్కుమాత్రమే. అయినను వస్తువిక్రయమున అతి లోకప్రజ్ఞ చూపుటకు ప్రారంభము చేసినాడు.

ఇతను చేయవలసినదని అధికారులు ఎంచుపనికంటె ఎక్కువపనిని ఇతనుచేయువాడు. ఇతడు ఏపనిచేసినను తాను కంపెనీయొక్క జీతగాడినను దృష్టితోగాక కంపెనీయొక్క భాగస్వామినను దృష్టితో చేయుచుండువాడు.

అందుతో ఆకంపెనీ యజమానులు ఇతనిని ఆకంపెనీతరఫున వస్తువిక్రేతగా (సేల్సుమెన్) నియమించిరి. హెన్రీ జీవితమున ఉత్తమఘట్టము ప్రారంభమైనది. నూనె అమ్మటలో ప్రత్యేకశ్రద్ధ వహించెను.

ఒకటిరెండు సంవత్సరములలో ఇతనికి రాయల్ డచ్ ఆయిల్ కంపెనీయొక్క సేల్సుమేనేజరుపని ఈయబడెను. అచిరకాలముననే హెన్రీ ప్రపంచమునందలి సమర్థులగు సేల్సుమేనేజర్లలో నొకడని అనిపించుకొనెను.

తనకు ఇదివఱకే ఏర్పడియున్న ఖాతాదారులతో వ్యవహరించు విషయమునందే ఇతర వ్యాపారులవలె ఇతను దినమునకు ఏడేసి గంటలకాలమును వెచ్చించలేదు. హెన్రీ దినమునకు ఎన్నిగంటలకాలమును వెచ్చించినను వ్యాపారమున తన ప్రత్యర్థులగు వారికిగల ఖాతాదారులను తాను ఆకర్షించుటకు మాత్రము వెచ్చించువాడు.

క్రొత్త ఖాతాదారులను ఆకర్షించుటకై ఇతను న్యాయబద్ధమైన ప్రతిపనిని చేయువాడు. వస్తువుమూల్యమును తగ్గించువాడు. ఒకానొక మనిషిని తాను క్రొత్తఖాతాదారుగ ఏర్పరచుకొనగలనని ఇతనికి నమ్మకము తోచుచో ఒక బేరల్ నూనెనుకూడ అతనికి మిక్కిలి చౌకధరకు విక్రయించువాడు.

నూనెవ్యాపారమున ఇతని ప్రత్యర్థి లార్డు కౌడ్రే. కౌడ్రే తలచినచో స్వయముగ నూనె రాజై రాక్ ఫెల్లరు అంతవాడై యుండును. అట్టివానికి మనహెన్రీ నూటఏబదిలక్షల పౌనుల ధనమును ఒక్కసారిగఇచ్చి ఆవర్తకమున అతనికి ఎట్టి జోక్యములేకుండ అవతలికి నెట్టినాడు.

లార్డు బియర్ స్టెడ్ తో సంప్రదించి షెల్ కంపెనీనికూడ బ్రహ్మాండమగు తన ఆయిల్ కంపెనీలోనికి గొనివచ్చినాడు. 1930-వ సంవత్సరప్రాంతమున జర్మనీయందలి ఆయిల్ కంపెనీలను కూడ లోగొనుటకు ఇతను ప్రయత్నములు సాగించినాడు. ఇతను మఱియొక ఇరువది సంవత్సరములు బ్రతుకుచో ఆంగ్లోపెర్షియన్ స్టాండర్డు ఆయిల్ ను కూడ ఈతనులోగొనును. నూనెను సిద్ధముచేయు ఐదు రిఫయినరీలు, స్టేట్సునందు రెండులక్షల నలుబదియొక్క వేల యకరముల నేలలో వ్యాపించియున్న నూనెగనులకు ఇతను ఇప్పుడే స్వామదారుడై యున్నాడు.

1930-వ సంవత్సరమునకు ఇతనికి అరువదిరెండు వత్సరములు. ఉష్ణప్రదేశమగు ప్రాగ్దేశములందు చిరకాలముండి వచ్చినవాని వలె హెన్రీ తల అప్పుడే నెరసినది, నేత్రములు నల్లబారినవి, చర్మము కాంతివాసినది.

కాని ఇతని మందహాసము ఇంపై ఎల్లరనాకర్షించునదిగా నుండును. హెన్రీకి ప్రయోగము, ఉపసంహారము రెండును తెలియును. వలయుచో ముందుకుదూసుకొని పోగలడు. అవసరమగుచో చల్లగ వెనుకకుమళ్లగలడు. ఇతడు పామేదాతనము కలవాడే. అయినను ప్రజ్ఞానిధి. వస్తువిక్రేతగా హెన్రీ అతిలోకుడు.

మాస్టర్ సేల్సుమాన్ అనదగినవాడు. వ్యాపారవిస్తృతియే హెన్రీ ప్రధానలక్ష్యము.

ఇతని ఆఫీసు లండనులో, బ్యాంకుకు ఎంతయో దూరమున లేదు. అతని చుట్టును వలయాకారమున మేజాబల్లతీర్చి యుండును. తన మందిరముయొక్క ఐదవ అంతస్థున హెన్రీ ఆఫీసుగది.

ఆగదిలో ఈవణిక్పుంగవుని ఎదుట ప్రపంచముయొక్క మ్యాప్ ఒకటి వ్రేలాడుచుండును. పెర్షియాదేశమున తప్ప ప్రపంచమున నూనెగల మిగిలిన అన్ని దేశములందును ఈతని కంపెనీవారికి ఆస్థిగలదు. నూనెకంపెనీల లీగ్ నొకదానిని నిర్మించి దాని యాజమాన్యమున ప్రపంచమునందలి నూనెవర్తకము నంతను నిర్వహింపజేయువరకు హెన్రీకి నిద్రపట్టదు, తృప్తికలుగదు.

అది ఇతని నేటిస్థితి. ఏబదిఏండ్లక్రితము ఇతడే ఆమ్‌స్టర్‌డమ్‌నందలి ఒకానొకమూరుమూలవీధిలో ఒకానొక చిన్నకుటీరమున పేదబాలుడై నివసించుచు గాలికితఱుచు ఆరిపోవు కొవ్వ వత్తిదీపము ముందు ప్రపంచయాత్రకు సంబంధించిన పుస్తకములను చదువుకొనుచుండువాడు.

ఎంతటి భేదము!



# ఉద్యోగవాంఛ

౧

వెంకట్రాయుడు పాతికేళ్ళమనిషి. వాళ్ళవూరి వీధిబడిలోనే చదువుకుని హైస్కూలుపరీక్ష యిచ్చాడు. అంతతోసరి! చదువుకోటాకు వేసింది. గుండాభాయి జట్టులో తిరిగి కొన్నాళ్లు పెద్ద రౌడీ వనిపించు కున్నాడు. చిప్పకాయల్లో ఫస్టురకం. కొన్నాళ్ళకి సంసారభారం తనమీదపడ్డాది. ఏంచేస్తాడుయిక ? వుద్యోగానికి చాలా ప్రయత్నించేడు. యెక్కడా దొరకలేదు. దొరికేదాకా వూరికేకూచుంటే కడుపు గడవడమెట్టా ? తను పస్తుపడుక్కుంటే సరిపోతుందా ? తల్లీ ! పెళ్ళామూ యేమౌతారు ? ఆలోచించి! ఆలోచించి రాయుడు స్వంతకేరీ వ్యవసాయం పెట్టాడు. కాస్తోకూస్తోపండుతున్నాది. యెల్లాగో వుంటీ అవక, లేదూఆవక కాలక్షేపం జరుగుతున్నాది. బుర్రతిరుగుడుకూడా చాలామట్టుకు తగ్గింది.

రాయుడుకి ఏమీ తృప్తిలేదు. వుద్యోగంచెయ్యాలని అతనిపట్టుదల. ఎలాగన్నా సంపాదించితీరాల్సిందే. ఎవరేనా పెద్దవుద్యోగస్తులు ఆవూరికివస్తే, సప్లయిచేసినా, చెయ్యకపోయినా అటూ యిటూ తిరిగి హడావుడిచేస్తూ, చాలాకష్టపడి పని చేస్తున్నవాడిలా తోపించేవాడు అధికార్లకి. వాళ్లయెదటనే మునసబుకీ, కరణానికీకూడా యేవో సప్లయిపనులు పురమాయించేవాడు మహాపలుకుబడివున్న వాడిలాగ. యిల్లాగే. తహసీల్దారు, మేజస్ట్రేటు మొదలైనవారిదయ సంపాదించుకున్నాడు. సమయం చిక్కితే ఏదన్నా వుద్యోగం పారెయ్యరా అని అతగాడి వుద్దేశం. రోజూ పోష్టాఫీసుకెళ్లి తనకేమైనా కవరుత్తరాలు, ఉద్యోగస్థులురాసినవి వస్తాంటాయేమో అని రోజూ చూసేవాడు.

ఎలాగైతేనేం వచ్చిందో సర్వీసుకవరు త్తరం ఒకనాడు. అప్పుళ్లో పోస్టుమేష్టరు అక్షరాలు కూడబలుక్కుని ఆయింగిలీషు చిరునామాచదివి వెంకట్రాయుడికి యిచ్చేడు. రాయుడు ఆతురతగా అందుకుని పొంగిపోయేడు. రోజూకుంటూ తిరిగి దాన్ని పోస్టుమేష్టరుకిచ్చి 'యెవరిదగ్గిర్నించి వచిందో చూసి చెప్పండి!' అని బతిమాలుకున్నాడు, తనకు ఆమాత్రం యే, బీ, సీ, డీలూ రాకపోవడంవల్ల. అతను ఐదు నిమిషాలు పరకాయించిచూసి 'మేజస్ట్రేటు గారి దగ్గర నుంచి' అని చెప్పాడు. రాయుడు వెంటనే అతని చేతులోంచి ఆకవరు లాక్కుని ఒక్కగంతు వేశాడు. పోస్టుమేష్టరు 'ఏమిటయ్యా సమాచారం!' అంటూ వుండగా- 'చెప్తా మళ్లీవొచ్చి', అని గాభరాగా యింటికి పరుగెత్తాడు. తనగదిలో ప్రవేశించి తలుపుగడియవేసుకుని ఒక కిరసనాయిలుదీపం వెలిగించి (ఆపూరింటిగదికి కిటికీలు లేవులెండి, తెరవడానికి) జాగర్తగా కవరువిప్పి లోపలికాగితంచూసేడు. దైవం రక్షించి అది తెలుగు నేవుంది. అది ఒకసారికాదు, పదిసార్లు చదువుకున్నాడు. పరమానంద సముద్రంలో మునిగిపోయి ఐదునిమిషాలు స్పృహతప్పిపోయాడు. తెలివివచ్చాక 'అమ్మోయ్!' అని అంటూ గది

లోంచి వసారాలోకి ఒక్కదుముకు దుమికాడు.

'ఏమిట్రాబాబూ! నాయనా! ఏమయిందిరా?' అని అరుస్తూ కాళ్లు గజగజవొణుకుతూ తల్లి వచ్చింది.

రాయుడు రోజుతూ 'మరేం కాదమ్మా! ఉద్యోగం! నాకు వుద్యోగమైంది! యిదుగో ఆర్డరువచ్చింది.' అంటూ ఆ కాగితం చూపెట్టాడు.

ఆవిడ ముఖం చేటంతయింది. తలవిూంచి జారిపోతున్న ముసుగుని సర్దుకుంటూ 'ఉండ్రా! నాయనా! పెరట్లో నూతిదగ్గిర కోడలుంది. యీసంగతి చెప్పివస్తాను' అని వెళ్లబోయింది.

రాయుడు—వుండమ్మా! నీనోట్లో నువ్వుగింజ నానదు! అప్పుడే యేంతొందరమ్మా! క్రమంగా దానికే తెలుస్తుందిలే!

తల్లి—అయితే నీయిష్టమే కాని. బాబూ! జీతమెంతరా?

రాయుడు—నెల 1 కి తొంభైనొక్క రూపాయిలు! ఏ ఎమ్మేలకీ, బియ్యేలకీ వుందమ్మా యింత జీతం?

తల్లి—అవున్రా నాయినా! అదృష్టంచేసుకు పుట్టాలిగాని చదువులో యేముందీ? చూడూ! వాళ్ళరామిగాడు బియ్యేఅయికూడా ఉద్యోగం, సద్యోగం లేకుండా ఇంటో కూచున్నాడు. పోనీ! యిన్నాళ్ళకి మనదరిద్రం తీరిందిలే. ఎవరువేశేరు బాబూ వుద్యోగం?

రాయు—ఎవరేమిటే? మన మేస్త్రీటుగారు! నామీద ఆయనకి చాలాదయ! తక్కువజీతం పని అయితే నేను వొప్పుకుంటానో వొప్పుకోనో అని పెద్దవుద్యోగమే పారేశాడు!

తల్లి—యేంవుద్యోగం బాబూ!

రాయు—ఏమిటో యింకావివరం తెలీలేదు. ఏమిటుంటుంది? యీమునసబులమీదా, కరణాలమీదా అధార్టీ చెలాయించి, పల్లెయిల్లోనూ తదితరాల్లోనూ పనిపుచ్చుకోడమైవుంటుంది. మొన్న నేను మేస్త్రీటు దగ్గిరే మునసబుపైని దావత్తు చెలాయించి గడగడలాడించేను. మేస్త్రీటు కూడలెత్తిపోయాడు. యిలాంటివాడిని చేతులో వుంచుకోవాలంటూ, అల్లాంటి మునసబుగాళ్ళని అణచివుంచడానికీ వుద్యోగం వేసివుంటాడు. ఇక నాకదాఖా బాగా చూపిస్తాను, మునసబులందరికీ.

తల్లి—వుద్యోగం వుద్యోగం అంటూ పట్టుపట్టుకు కూర్చుని సాధించేవురా బాబూ! నువ్వే బహద్దరువి!

౨

గదిలో మంచంమీద వెల్లకిలాపండుకుని వెంకట్రామయుడు ఏవో ప్లానులువేస్తున్నాడు. ఇంతట్లో ఇత్తడిచెంబుతో మంచినీళ్లు తెచ్చి మంచంక్రింద పెట్టి బుచ్చెమ్మ తలుపుగడియవేసి మెల్లిగా మంచం దగ్గిరికి వెళ్ళింది.

బుచ్చె—ఏమిటలా ఆలోచిస్తున్నారు? పెళ్లనికి ఏంనగలు చేయించేదా అనేనా?

రాయు—నగలకేంలోటే బుచ్చీ! నీకు? రెండునెల్లు వోపికపట్టు. ఒళ్ళంతా బంగారం మలామా చేయిస్తాను. మొందటి రెండునెల్ల డబ్బూ పెట్టి నా ఆఫీసు వస్తువులు, డ్రస్సులు, ఏర్పాటుచేసుకోవాలి! చిల్లరప్పులు తీర్చెయ్యాలి. ఒకయేడాది యింటిఅద్దె పారెయ్యాలి!

బుచ్చె—ఇంటిఅద్దె ఏమిటండోయ్!

రాయు—ఇంత పెద్ద వుద్యోగస్తుడను అని అనిపించుకోని, యీవూరికొంప అరుగులమీద కచ్చేరీ చెయ్యమన్నావా! సిగ్గుసిగ్గు! వచ్చే వుద్యోగస్తులూ, పోయే వుద్యోగస్తులూ చూసి యేమిటనుకుంటారు? అందుకనే పెద్దినాయుడుతో మాట్లాడాను. వాళ్ళ మేడమీది గదులు ఒకయేడాదిదాకా నాస్వాధీనం చెయ్యడానికీ. యేభై రూపాయిలు ముట్టజెప్పడానికీ నిర్ణయించాను. ఎల్లుండినించీ నేను అక్కడే మకాము. భోజనానికి యిక్కడికి వస్తూవుంటాను.

బుచ్చె—మేమూ అక్కడికేవస్తాం.

రాయు—వీల్లేదు. కాపువాళ్ళయింటో మీరిలా

వంటా, పెంటాచేస్తారు? ఒక్కయేడాది వోపిక పట్టండి. యీలోపుగా యిక్కడే ఒక భవంతి లేవదీస్తాను.

బుచ్చె—అదుగో! అదొకటి తలపెడితే నాకు వస్తువులు వచ్చేటట్టే ఎందుకూ ఆబద్ధాలు మాటలాడడం?

రాయు—భవంతి కట్టించేమంటే ఎక్కువసొమ్ము ఔతుందనా నీవూహ! వెట్టికూలీలు, వెట్టికంసాళ్లు, వెట్టితాపీవాళ్లు దమ్మిడీ ఖర్చులేకుండా పనిచేస్తారు. కలప పూరికే సంపాదించొచ్చు. ఇక దానికి డబ్బు ఎందుకు ఎక్కువ అవుతుంది? పలుకుబడివున్న వాడిని, నాకే కర్చవుతుందేమి? వెట్టివాళ్లు పని చెయ్యకపోతే ఎరగరూ నామజా.

బుచ్చె—బాగావుంది! ఇకమనకేంలోటూ! కాని మీచేతికింద ఏదైనా పనికలిసివస్తే మా అన్నయ్యకి పనివేయించరూ? బియ్యేదాకా చదివి ఊరికే వున్నాడు. మీపేరు చెప్పుకుని మావాళ్లు హాయిగా బతుకుతారు.

రాయు—చూదాంలే అప్పటిసంగతి! చదువంటే-యేదో-చదువుకుంటారుగాని యీ, బియ్యేలకీ, ఏళ్ళకీ లోకజ్ఞానం అనేది తక్కువ.

బుచ్చె—దైవం రక్షించి మనకోకాయకాస్తే అది ఆడుకుందికి వోతొక్కుడు మోటారూ, సైక్కులుబండీ కొంటారుకదూ!

రాయు—ఓస్! అదేఅబ్బురమా! ఇంతెందుకూ? యీయేడాది, యిల్లయితే, మరోయేడులో గుర్రపు బగ్గీ మనకి రావనూ?

బుచ్చె—(సంతోషంతో) యేం అదృష్టవంతురాలివమ్మా నేను? నాపూజలు యిన్నాళ్ళకి ఫలించాయి! యిక మాకేమిటి తక్కువ?

3

రాయుడుతల్లి వెంకమ్మ పెరటిపంచ దగ్గిర తులసికోటపక్కని కూచుని పత్తివత్తులు చేస్తూవుంటుంది. పక్కవీధి సుబ్బమ్మ 'వెంకమ్మక్కా!' అని పిలుచుకుంటూ వస్తుంది. యిదివరకు ఆప్యాయంగా జవాబిచ్చి కూచోమని చెప్పే వెంకమ్మ పలకవన్నా పలకలేదు. సుబ్బమ్మ వెంకమ్మపక్కని నుంచుని మళ్ళీ పిలిచింది.

వెంక—నువ్వటే సుబ్బీ! పరధ్యానంగా వున్నాను, మాట వినిపించడంలేదు! కూచోవే!

సుబ్బ—(కూచుని) ఏమే! చెప్పవన్నాలేదూ, మీరాయుడికి వుద్యోగమయిందనీ!

వెంక—(విసుగుతో) విన్నవేగడటే కాగితం వస్తా. అప్పుడే యెక్కడచెప్పేదే? ఏం లోకమమ్మా! అప్పుడే యెలా పాక్కిపోయిందో!

సుబ్బ—తెలిస్తేయేమే! సంతోషించేవాళ్ళమే గాని, దుఃఖపడేవాళ్ళం కాదుగదా మేము!

వెంక—నీసంగతికాదే! చెప్తున్నాను లోకంరీతి! ఎంత కష్టపడ్డాడనుకున్నావ్ ఆవుద్యోగానికి! తొంభైవకటికాదు, తొమ్మిదివందలు జీతంచేసినా ఆ కష్టానికి చాలదు. ఏమనుకున్నావో గానీ!

సుబ్బ—తొంభయ్యొకటాజీతం! ఏం అదృష్టవంతురాలవమ్మా, అత్తా కోడళ్లూనూ, మా అభాజనం బియ్యేచదివీకూడా యింటోకూచున్నాడు, పనీలేక బండలూలేక. 'ఏమిరా! పనికి చూస్తున్నావురా' అంటే తెల్లమొగంవేస్తాడు. అస్తమానం పెళ్లాన్ని ఎదురుగుండా కూచోపెట్టుకుని కబుర్లు చెప్పమంటే చెబుతాడు. ఎందుకొచ్చినకబుర్లు! మీవాడు ఆ యింగ్లీషు ఏమీ రాకపోయినా నూరురూపాయిల వుద్యోగం యెడంచేత్తో సంపాదించేడు!

వెంక—ఎందుకే ఆ పీచుపీచు చదువులు! డబ్బుదండక్కగానీ! ఏమిటిలాభం! యింతకీ అదృష్టముండాలిగాని చదువులేం పనిచేస్తాయే?

సుబ్బ—నిజమేనక్కా! మారోజులు యెలా తెల్లారతాయో అని బెంగపట్టుకుంది. ఉన్న మడిచెక్కలు పీడి చదువుకోసం బుగ్గిలో కలిపివేసేం. దారీ, తెన్నూ తోచలేదు.

వెంక—విచారించకే సుబ్బీ! మావాడితో చెప్పి

యేదన్నా కిందిపని కలిసొస్తే తప్పకుండా మీవాడి సంగతి చూసేటట్టు చేస్తాను. ఆపైన మీఅదృష్టం!

సుబ్బ—సరేనమ్మా! అలా ఏదేనా చేయిస్తేనట్టా యనా, నీమేలు మరిచిపోను. నాశరీరం నీకు చెప్పులు కుట్టియిస్తా. మరిచిపోకేం?

వెంక—ఎంతమాటన్నావే?

౪

[రామారావు యిరవై రెండేళ్ళమనిషి. బి. ఏ. ప్యాసయి ఏడాదిఅయింది. ఎక్కడా వుద్యోగం దొరక్క యింటోనే ఉన్నాడు. 'హిందూ' పత్రిక 'వాంటెడ్' కలములుచూస్తూ వసారలో వడకకుర్చీలో కూచుని వుంటాడు, గదిగుమ్మాని కెదురుగా. గదిలో అతనిపెళ్లాం పద్మ సింగారం పూర్తిచేసుకుని గుమ్మందగ్గిర నిలబడివుంటుంది.]

పద్మ—ఎవర్తికేనా కలుగుతుం దదృష్టం, నాలాంటి దరిద్రదేవతకి తప్ప!

రామా—(పత్రికమడిచి) ఏ మొచ్చిం దేమిటిప్పుడు?

పద్మ—పెళ్ళయి నాలుగేళ్ళయింది—కాపరాని కొచ్చి యేడాదిపైగా దాటింది. నగా, నట్రా, ముద్దూ, ముచ్చటా, ఏమన్నా తీరాయా? మీరే ఆలోచించండి. బుచ్చెమ్మచెప్పింది, వాళ్లాయనకి పెద్ద వుద్యోగం అయిందట! ధరంతిక ఇస్తారట! ఒళ్లు బంగారం మలామా చేయిస్తాడట! బగ్గీలూ, మోటారులూ కొంటాడట! దానిదే అదృష్టంగాక! మీరు పెద్దచదువులు చదివినా కానీ వుద్యోగమే నాలేదు.

రామా..............

పద్మ—నగా, నట్రాసంగతీ అలావుండనీండి. మీకుతోడు నేనుకూడాను, పిళ్ళపీకమీదికి. ప్రతిరోజూ రుసరుసలే పట్టెడన్నానికి! ఏదేనా చిన్నపనేనా సంపాదిస్తే యీబాధ తప్పిపోతుంది.

రామా..............

పద్మ—బుచ్చెమ్మచెప్పిందిలెండి! ఏదేనా, ఆయన కింద పనికలిసొస్తే మీకు యిప్పిస్తుందట!

రామా—ఎవరిసంగతే చెప్తున్నావు నువ్వు!

ఇంతట్లో రామారావుతల్లి సుబ్బమ్మవస్తుంది. కోడలు గదిలోకి పోతుంది. సుబ్బమ్మ రామారావుని చూసి

'ఏమిరా రామం! పొట్టికాగితాలేనా, యేమన్నా వుద్యోగాలు ఖాళీపడిన వున్నాయా! ఎందుకురా డబ్బుఖర్చుకి, ఆ చేటకాగితాలూ?'' అంటే 'యిందులోనే వున్నది నాభవిష్యత్తంతా' అంటూ డబ్బు తగలేస్తున్నావు. ఏం డబ్బు ఖర్చుపెట్టేడని, ఆ రాయుడికి, పెద్దవుద్యోగం దొరికింది? ఇంగిలీషు ముక్కలన్నా రెండురావు. యింతికీ, నేంచేసుకున్న అదృష్టం! బోలెడు ఖర్చుపెట్టి - మడిచెక్కలమ్ముకుని- చదువెచెప్పించి, చివరకి తిండికికూడా కష్టపడిపోతున్నాం. నువ్వు పనీ పాటూ లేక పెళ్లాంతో కబుర్లుచెప్పుకుంటూ నిర్భాగ్యపు దామోదరపెద్దమ్మవి తయారయావు' అంది.

రామారావుకి వొళ్లుమండిపోయింది ఏచెయ్య గలడు? ఆవేశంగా యిల్లువిడి పోదామనుకున్నాడు —కాని, కట్టుకున్న పెళ్లాంగతి ఏమౌతుంది? అందుచేత శాంతంవహించక తప్పిందికాదు.

సుబ్బ—తొంభై వక్కరూపాయిలట వుద్యోగం వాళ్ళసంగతీ, సందర్భమూ చూస్తే ఎంతో ముచ్చటయింది.

రామా—తొంభై వకటి జీతమూ ఏంచదివేడని?

సుబ్బ—చదువెందుకూ, అదృష్టముండాలిగాని.

రామా—నాకేమీ అర్థంకాలేదు. ఏముద్యోగం? ఎక్కడేమిటి?

సుబ్బ—ఎక్కడేమిటి? యీవూళ్లోనే. అదేం వుద్యోగమో, చదువులూ, చట్టుబండలూ యేడిసిన మీకు తెలియాలి. నాకేంతెల్సు?

రామా—ఇదంతా ఓగారడీలాగుంది యదార్థం తెలుస్తేగాని నమ్మకంలేదు.

సుబ్బ—అవును నీకు పనిలేకపోతే, ప్రపంచంలో మరి ఎవరికీ పనికాదనేవూహా ఏడిశావు వద్దమ్మాని.

(పోవును)

రామా—ఏ, బీ, సీ, డీలు రాని దద్దమ్మకి, 91 జీతమేమిటీ, అదీ యిలాంటి పల్లెటుళ్లోనే యేమిటీ, వీళ్ళంతా అదివమ్మి వన్ను ఎత్తిపాడవడమేమిటి? ఇదో నాటకంలాగుంది. రిసెర్చిచేసి ఫలితాలు కనుక్కోవాలి.

౨

రాయుడు కుర్చీమీదకూర్చుని వుంటాడు. ఎదురుగా ఒక టేబిలు. పక్కని ఒక బెంచీ. రామారావు అక్కడికి వస్తాడు. రాయుడు 'కూచోరా, రామం' అని బెంచీచూపిస్తాడు. కొడుకుహోదా చూడడానికి, తల్లి వచ్చి అక్కడే నుంచుంటుంది.

రామా—బాగుందిరా అబ్బీ నీసంగతి. తొంభయ్యొక్క రూపాయిల వుద్యోగం సంపాదించావట మేం, ఏంచదివినా, నీ కాలిగోరికి పోలం.

వెంక—ఇది మీఅందరిదయా, వాడి అదృష్టమున్నూ. నీకుమాత్రం పనికాకపోతుందేమిటి రాముడూ.

రామా—ఏం ఉద్యోగమేమిటి రాయుడూ.

రాయు—వాయుడి మునసబులమీద కరణాల మీదా, రివిన్యూ యినస్పెక్టర్లమీదా, అయివుంటుంది. ఆయింగ్లీషు మాటేమిటో నాను అర్థంకాలేదు. నువ్వు చూసి చెప్పు.

అని యింటోకివెళ్ళి కావిడిపెట్టి తాళంతీసి 10 కవర్లలో దాచిన ఆర్డరుకాగితం తెచ్చి రామారావు చేతిలో పెట్టాడు. దాన్నిచూడగానే రామారావుకి పట్టరాని నవ్వొచ్చింది. ఆపుకోలేకపోయాడు. 'యీవుద్యోగమట్రా' అని నవ్వేసేడు— కడుపు చెక్కలయ్యేటట్లు.

రాయుడూ, తల్లీ నిర్ఘాంతపోయారు. కోపం కూడా కొంచెం వచ్చినట్టుంది, ఆవాలకంచూస్తే. ఇంతలో, యేదోపుట్టి మునిగిపోయినట్లు బుచ్చెమ్మ కూడా వచ్చింది.

రాయు—యేమిరా అలాఅంటున్నావ్?

రామా—ఇది, ఎన్యూమరేషను వుద్యోగం జనాభాలెక్కలు రాయడం దీనికి జీతం, బత్తెంవుండవు. నె 91 రు. అంటే నెలకి తొంభయ్యొక్క రూపాయి జీతంకాదు. తొంభయ్యొకటో నెంబరు వాడి వన్న మాట నువ్వు!

వెంక—ఐతే యిది వుద్యోగమేనా

రామా—వుద్యోగమే—చెప్పలేదూ జీతం, బత్తెం వుండవని.

బుచ్చె—జీతం, బత్తెంలేనివుద్యోగం మీకెందుకండీ దండగ. నాకు అక్కర్లేదని రాసేయండి మేస్త్రీటుకి.

రామా—అక్కర్లేదంటే వొదిలే వుద్యోగంకాదిది. చేసితీరాలి.

రాయు—ఇదా, నాకు మేస్త్రీటుతో వున్న పరిచయానికి ఫలం?

వెంక—అక్కర్లేదంటే—యేంజేస్తారేమిటి?

రామా—యేంజేస్తారా? జైదులో కూచోపెడతారు.

వెంక—, బచ్చె—రాయు— (వణుకుతూ) జై...లే?

—"రావు"



# పానుగంటివారి వ్యాసరచన

రచయిత:

పెమ్మరాజు రాజగోపాలము, బి. ఏ.

(ఉపక్రమణము)

ఆంధ్రదేశమున నాంగ్లేయభాషయొక్క ప్రోద్బల మేనాటనుండి ప్రారంభమైనదో, నాటనుండియే తెలుగుబాసలో నూతన పరివర్తన మారంభమైనది.

ఆ పరివర్తనమునకు తొలుదొల్త మార్గదర్శకుడు వీరేశలింగము పంతులు. వంగసీమల నుండి పొంగివచ్చిన తరంగము, వీరేశలింగముగారిని జిజ్ఞాసువును చేసినది. సాంఘిక పరివర్తనమునకు భాషాసాహాయ్య మత్యవసరమని, అందుచే నాంధ్రావలి కందుబాటులో నుండుటకై నతి కఠినమైన వచన రచన లవసరమని యాతడు కనుగొనెను.

కాలపరిస్థితులు కవినీ, కవి దేశముయొక్క భావి భాగ్యమునూ నిర్ణయముచేయుచుండును. కావున నాటి సాంఘిక, మత సంస్కరణమునకు వీరేశలింగముగారు వచన రచనమే ముఖ్యమగు సాధనముగా గైకొనినాడు. కావుననే ఆయన వివిధమార్గ విలసితములగు వ్యాసములు వ్రాసినాడు. గద్యతిక్కన అనిపించుకొన్నాడు.

ఆంధ్రవాఙ్మయమున పొడసూపిన నవయుగారంభమున వీరేశలింగముగారే నవ్యవచన రచనాజనకత్వము వహించెనని చెప్పక తప్పదు. ఆకారణముచేత నాయన నవయుగ ప్రవర్తకఅని, ఆంగ్లేయభాషా సముద్రమున యానమొనర్చి క్రొత్తదారులు చూపిన భాషానావికుడని చెప్పక తప్పదు.

వారి సమకాలీకులు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. వీరు వచనరచనమందు కాని, దానిలో నవలలూ, జీవచరిత్రలూ మొదలగు భావనా ప్రగర్భితములగు నూతన కల్పనములు ఆంధ్రదేశమున కర్పించినారు. వీరిశైలి మృదుమోహనము. భావావేశముచే కించదుద్రిక్తము.

కాని వీరిరువురిలో నవ్యత తోపాటు ప్రాచీనతకూడ కలదు. 'ప్రాతక్రొత్తల' మేలుకలయిక క్రొమ్మెరుంగును చిమ్మగా వ్రాయగలిగిరి. అంతియేకాని నవనవోల్లసితమగు అపూర్వ నూతన మార్గము త్రొక్కరైరి. దానికి కారణ మప్పటి కింకనూ ప్రబంధ వాసనలతో కూడిన పద్యరచనమందలి అభిలాష చావకుండుటయే.

అంతలో స్వతంత్రవాయువులు ప్రాగ్దిశ నుండి వీవసాగినవి. వంగ విభజనము తర్వాత భారత ప్రజలలో స్వేచ్ఛాబీజములు ప్రబలిపోయినవి. భారతీయుల భావములు నందు

ముఖ్యముగ భావోద్రిక్తులగు నాంధ్రుల భావములు, గురికట్లతోగూడిన పద్యములలో నిల్వక, స్వైర విహార ధీరయగు వచనధారా వేగమున బహిర్గతముగా చొచ్చినవి.

అందుచే పెక్కు విధములగు జీవచరిత్రలూ, కథలూ, వ్యాసములూ తలలెత్తసాగినవి, అనేక గ్రంథమాలలూ, వివిధ మాసపత్రికలూ ఉద్భవించినవి.

పానుగంటి నరసింహారావు గారి యుగము

కావున సర్వతోముఖాభివృద్ధి వాంఛించు చున్న తెలుగు నాగరికతకు వచన రచనములో నవ్యరీతుల చాల అవసరమైనవి. తోడనే కాలశక్తి, మన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిని చక్కగా నేర్పరించి కోరుకొన్నది.

అప్పటి తెలుగు రచయితలలో పానుగంటి నరసింహారావుగారు కూలంకషమైన ఆంగ్ల భాషా పాండిత్యము కలవారు. చక్కని సారస్వత పుష్టికలవారి మెదడు కవితాహృదయముతో కలసి ఆంధ్రమున నవ్యవచనా రచనారంభము మొదలుపెట్టెను.

తెలుగువారి, భాషా, సామాజిక, రాజకీయ మతవిషయక జీవినములో పరివర్తనము తీసికొని వచ్చుటకు, సహజ గంగాఝురీవేగముకల నుపన్యాసధోరణితోటి వ్యాసరచన మవసరమని గ్రహించి చక్కని మార్గముల నరసికొన్నారు.

పూర్వకవులకు సంస్కృతభాష ఎంత ప్రోద్బల మిచ్చివున్నదో, నేటి రచయితలకు నాంగ్లభాష అంతకన్న వేయిరెట్లు సాయము చేయుచున్నది. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి వ్యాసరచనలలోకెల్ల పేర్కొనదగినవి. (1) ప్రకీర్ణోపన్యాసములు, (2) సాక్షి సంపుటములు, (3) కథలు. ముఖ్యముగ వారి కీర్తిలత ప్రాకికొనుటకు సాక్షిసంపుటములె పట్టుకొమ్మలు. ఆంధ్రపత్రికలో నెప్పుడు సాక్షి వచ్చునా అని ఆంధ్రు లమితోత్సాహముతో నెదురుచూచుచుండిన దినములు కలవు.

ప్రకీర్ణోపన్యాసములు

ముందు ప్రకీర్ణోపన్యాసములను గురించి యించుక ముచ్చటించవలసి వున్నది. అవి చాలవఱకు సువర్ణ లేఖలో ప్రకటింపబడి వున్నవి. కాని అవిచాలవఱకును అతిప్రౌఢము లైనవియే అని చెప్పవలసివున్నది. అప్పటికి వారి వచన రచన మంతగా గడితేరలేదు. భావములుకూడ నంతగా పరిణతి పొందలేదు. అందు ప్రకటింపబడిన వ్యాసములలో ముఖ్యముగా నెన్నదగినవి (1) కవి, (2) కవులకొక విన్నపము, (3) పురాణపఠనము, (4) జంటకవులు, (5) విమర్శాదర్శము, (6) స్వప్నకావ్యము.

వీనితర్వాత ప్రకటింపబడిన సాక్షిసంపుటములలోని భావములు చాలా విద్యావైశద్యము, భావౌన్నత్యము చాటుచున్నవి. అందు ముఖ్యముగ మూడవసంపుటము మొదలుకొని ఆరవసంపుటము ముగియునప్పటికి పంతులుగారి రచనా కౌశల్య మత్యద్భుత పాండితీ మండితమై నిరుపమానమైనది.

సాక్షిరచనము

సాక్షియను గ్రంథమునకు ప్రాతిపదిక కొంతవఱకు నాంగ్లభాషలోని ఎడిసన్ అను వచన రచయిత వ్రాసిన స్పెక్టేటర్ అను గ్రంథము. పంతులుగారు స్పెక్టేటర్ అను నామమును దానియొక్క ఇన్సిపిరేషనును మ్మాత్రమే గ్రహించినారు కాని దానియొక్క

గ్రుడ్డి అనుకరణ మెంతమాత్రము తీసికొని యుండలేదు.

ఇక సాక్షిసంఘ నిర్మాణము చాలవఱకు డికెన్సు అను ఆంగ్లనవలారచయిత రచించిన పిక్ విక్ పేపర్సులోని సంఘనిర్మాణమును పోలి యున్నది. మనసాక్షిలోని వాణీదాసు పిక్ విక్ పేపర్సులోని స్నడ్ గ్రాస్‌ని, బొజ్జయ్యశెట్టి, ఆగ్రంథములోని ఫాట్ బాయ్, జంఘాల శాస్త్రి కొంతవఱకు పిక్ విక్ గారినీ పోలిన దని నా అభిప్రాయము.

కాని సాక్షిలోని రచనా ధోరణి చాల స్వతంత్రమైనది. పానుగంటివారు ఎడిసన్ వలె సున్నితమైన చఱుకులుగాని డికెన్సువలె వెక్కిరింతపోట్లుగాని పొడవక పెక్కు విధముల జొనాథన్ స్విఫ్టువలె స్లెడ్జుహేమర్‌తో సమాజమును కొట్టినారని నాతెలంపు. వారి ప్రకీర్ణోపన్యాసములలో స్వప్నకావ్యము, జంట కవులు, పై విషయమును చాలవఱకు స్థిర పర్చును.

## శైలి

వీరి సాక్షిసంపుటములలోని శైలినిగూర్చి యించుక ముచ్చటింపవలసి యున్నది. ఆభాషా శైలి కవితా మనోజ్ఞమైనది. రసావిర్భావముతో కూడిన తరంగగమనమం దున్నది. అక్కడక్కడ మధురమైన ఆవేశము, వలసినచోట్ల మోటారువలె ధ్వనించు పదగుంభనలు కూడ కలవు. అడుగడుగునకు రచయిత తలహుద్రష్ట అని తేలకలదు. రచనలో సంఘమును సంస్కరింపజాలు పవిత్రమైన ఉద్దేశము అనర్గళధారావేగమున పొడకట్టుచు, వారి హృదయములోనుండి ఉద్వేత్తుగా ప్రవహించి, శ్రోతల పాఠకుల హృదయములనుకూడ స్పందింప జేయజాలియున్నవి. ప్రకీర్ణోపన్యాసములలో కాని, సందర్భానుసారముగా సాక్షి యుపన్యాసములలోగాని, కవితను గూర్చి కాని, ఆంధ్రభాషను గూర్చిగాని, రామాయణమును గూర్చి చెప్పినప్పుడు తప్పక మనకి వారి హృదయమును విప్పి చెప్పినట్లుండును.

మొత్తముమీద నరసింహారావుగారి వ్యాసములన్నియు దిలకింప, వారికి (1) కవిత్వము మీదను, (2) భాషమీదను, (3) స్త్రీల నాగరికమీదను, (4) పూర్వసాంప్రదాయములు, (5) మతము, (6) నవనాగరికత, (7) భక్తి, (8) వేదాంతము, (9) విద్యావిధానము, (10) రాజకీయవిషయములు, (11) విమర్శనాదృష్టి కల అభిప్రాయములు చక్కగా విదితమగును. అందుచేత చాలావఱకు వారి వ్యాసములలో వారి వ్యక్తి స్పష్టముగా పొడకట్టును.

కనక సావకాశముగ వారి వివిధ వ్యాసములలో పై విషయములను పరిశీలించి చూడ వలసియున్నది.

### 1. కవి : కవిత్వము

కవిత్వము ప్రకృతి ప్రియత్వమని, అతిలోకమగు విజ్ఞానుల వెఱ్ఱియని, చాలా నిర్మలత్వము కావలెనని వారి ప్రకీర్ణోపన్యాసములలో సెలవిచ్చియున్నారు. కాని సాక్షి అయిదవ సంపుటములోని కవిత్వమన్నా, కవియనినా చెప్పిన అభిప్రాయము వేఱుగాయున్నది. అయిదవ సంపుటములోని అభిప్రాయములు చాల సున్నితపథములో చేరినవి. అక్కడ కవికిని వేదాంతికిని అభేదముచూపింపబడినది. అందు కవిత్వమన్న గణబద్ధమైన వేదాంతవిషయక సంగీతమని తేలినది. తాను ధన్యుడై లోకమును ధన్యముచేయు కవినిగూర్చి పంతులు

గారిట్లు పాడినారు.

"మల్లెపూవుదూటి మధుపంబులోఁబాడి
గంధవాహుతోడ గలసి వీచి
యబ్ధిలోనమునిగి యౌర్వవహ్నిని గ్రాగి
నీటిబుగ్గ యగుచు నింగిఁబ్రాకి
తోకచుక్కతోడి డీకొని శ్రమజెంది
సాంధ్యరాగనదిని స్నానమాడి
తనువునిండ నింద్ర ధనసు రంగులుపూసి
కైరవాప్తసుధను గైపుకెంది
గోళగానరుతికి మేళవింపుగబాడి
పాడి, యాడి యాడి పాడి సోలి
భావనామహత్వ పటిమను బ్రహ్మమై
పోవుగలికి గోటి మ్రొక్కులిడుదు."

### 2. ఆంధ్రభాష

ఆంధ్రభాషమీద పానుగంటి పంతులు గారి ప్రేమ యింతింతనరాదు. మాతృభాషలో నుపన్యసింపలేనని చెప్పిన సభాపతిగారి మీద సాక్షి యుపన్యాసములో వీరు చూపిన ఆగ్రహము అత్యుత్తమ తరగతిలో చేరిన భావోద్రేకమునకు తార్కాణము. ఈవిషయము సాక్షి 3-వ సంపుటములోని 'స్వభాష' అను వ్యాసములో చూడతగును. వీరు గ్రామ్యవాదమును ఖండింతురు. సక్రమమైన, నియమ సహితమైన సరళాంధ్రభాష వాడవలెనని వీరియుద్దేశ్యము. మనకీ విషయము వారి ప్రకీర్ణోపన్యాసములలోని గ్రామ్యవాదుల భాషావాదము, విమర్శాదర్శం చెప్పక చెప్పును. ప్రస్తుతాంధ్రలోకమున యువకబృందము వ్యవహారిక భాషమీద మోజు పడుచున్నను వీరి గ్రాంథికభాషా వాదము వారిని రిచకితులజేసి తప్పక జిజ్ఞాసువుల జేయక మానదు.

### 3. స్త్రీలు

సాక్షి ప్రతి సంపుటములోనూ వీరు స్త్రీల విషయము ముక్తకంఠముతో నొక్కి వక్కాణించియున్నారు. నేడు నవనాగరిక కాంత ప్రపంచమందెల్ల యెడల, పురుషునిమీద తిరుగబడి, యథేచ్ఛా విహారమునసుండు తలంపుగొని, మితిలేని వ్యయమునబడి సంసారము నరకతుల్యముగ జేయుచున్నది. సంస్కరణాభిలాషులగు వీరు నిర్భయముగ, తగిన సమయమున, ఆంధ్రస్త్రీలకు జాగ్రత్తపాఠము చెప్పియున్నారు. సాక్షి నాల్గవసంపుటములోని స్త్రీల సభలోని జంఘాలశాస్త్రి యుపన్యాస ముత్తమశ్రేణికి చెందినది. సుభద్రకాని అభిమన్యుని, శకుంతలకాని భరతుని కనలేదని హెచ్చరించి, "మిమ్ములను చూచి భయపడు పుత్రికులు పుట్టెదరని" చెప్పినారు.

### 4. పూర్వ సాంప్రదాయములు

పంతులుగారు నవ్యవిద్యా సంస్కారులయిననూ వీరికిని పూర్వ సాంప్రదాయములమీద నభిమానము. సాక్షి రెండవ సంపుటములోన 'నిష్కారణనింద' అను నుపన్యాసమున మనకు పై విషయము గోచరమగును. కురుక్షేత్రమునుగూర్చి సాక్షి ౫-వ సంపుటములో వీరుచెప్పిన వాక్యములు చిర స్మరణీయములు. అందు వీరికి గీతమీద, పురాణములమీద కల అభినివేశము పూర్ణముగా వర్ణింపబడినది, శ్రీరామనవమి, మహాశివరాత్రి అను వ్యాసములలో వీరి పూర్వ సాంప్రదాయములయందలి అభిమానము చక్కగా ప్రకటితమగుచున్నది.

### 5. మతము

భారతదేశమునకు మతవిద్యా బోధన మత్యంతావసరమని వీరు చాల పూర్వమే గుర్తించినట్లు సుస్పష్టము. ఆవిషయము వీరి ప్రకీర్ణోపన్యాసములలోని ఒకచోట చర్చింపబడినది. కాని వీరిమతము సంకుచితమైనది

కాదు. దానికి తార్కాణముగ సాక్షి 5-వ సంపుటములోని అస్పృశ్యత అను వ్యాసము చూడఁతగివున్నది.

6. నవనాగరికత

మొత్తమువిూఁద వీరి సాక్షిసంపుటముల లోని పెక్కువ్యాసములు, మానవకోటి అధఃపతనమునకు దారిచూపుచున్న భ్రష్ట నాగరికలవిూఁద లేవనెత్తిన దాడుమో అనిపించును. ఈ విషయము సాక్షి 2-వ సంపుటములోని సనాతనాధునాతన నాగరికతలను వ్యాసములో చక్కఁగా విమర్శింపబడినది ; పెక్కుచోట్ల మహర్షుల వాక్యములకంటె దొరల వాక్యము లిప్పటి నాగరికులకు చాల ప్రమాణవాక్యములై పోయినవని విచారించిన ఘట్టము లున్నవి. సాక్షి 3-వ సంపుటములోని కుంభకర్ణుడను వ్యాసములో పంతులుగారు కేవల మాంగ్ల భాషాలోలులై మన నాగరికత కని పెట్టలేనివారిని కూర్చి మిక్కిలి వగచియున్నారు. పరవిద్యాభ్యాసము మనవానియందలి గౌరవ మెంతగా డిందుపడి చేయుచున్నదో ఆవిషయమున నొక్కి చెప్పివున్నారు. మనవారు స్నాన జపతపాద్యనుష్ఠానములు మానినందుకు మిక్కిలి వగచిన వ్యాసములు చాలగా నున్నవి.

7. భక్తి

మానవకోటికి తరణోపాయము భక్తి యని శ్రీవారి నిశ్చితాభిప్రాయము. అందు ముఖ్యముగ వీరు రామభక్తులు. ఈవిషయము మనకు సాక్షి 4-వ సంపుటములోని శ్రీరామనవమి అను వ్యాసము తెలుపుడు చేయ కలదు. వీరు రామాయణము వచ్చినపుడెల్ల భారతజాతికి కావలసిన ప్రబలాదర్శములం దున్నవని యుప్పొంగి వ్రాయుచుందురు అదిగాక వీరి శ్రీరామాయణ నాటకములలో నీ విషయము చక్కఁగా ద్యోతకమగును.

8. వేదాంతము

అక్కడక్కడ సందర్భానుసారముగా వచ్చు వేదాంతోపన్యాసములను పట్టి వీరు అద్వైతభావన కలవారేమో అని తోఁచుచుండును, వీరు శ్రీరాము నెంత కొనియాడుదురో, తాండవకృష్ణుని, తాండవ శంకరుని గూడ నంత ఆవేశముతోనే సాక్షి నాల్గవ సంపుటములో పొగడియున్నారు. భారతీయ వేదాంత సూత్రములనేకాక పశ్చిమ దేశీయ వేదాంత సూత్రములను కూడ చక్కఁగ గుర్తెఱిఁగి రెంటికిని చక్కని సమన్వయము జేయ కల ప్రజ్ఞ వీరికి కలదు.

9. విద్యావిధానము

వీరి సాక్షి వుపన్యాసములలో పెక్కుచోట్ల ప్రస్తుత విద్యావిధానము తీవ్రముగా తెగడియున్నారు. అందు దైవారాధనము, నియమానుసరణము లేక వట్టి నిరాస్తిక విద్యగా వున్నదను వీరియూహ లేమాత్రము సత్యదూరములు కావు.

10. రాజకీయములు

వీరి సాక్షి సంఘములో కావించుకొన్న నియమము ప్రకారము జంఘాలశాస్త్రి రాజకీయమును గూర్చి అంతగా ముచ్చటించ లేదు. సాక్షి రెండవ సం॥న వీరు ఎన్నికలనుగూర్చి చక్కఁగా నుపాలంభించియున్నారు. తర్వాత గాంధిగారి తపస్సమాప్తిని గూర్చి సాక్షి 6-వ సంపుటములో చెప్పుచు వారు మొదటినుండియు గాంధిగారి ఉద్యమమును చక్కఁగ బరిశీలించుచున్నట్లు వెల్లడి చేసియున్నారు.

11. విమర్శనాదృష్టి

వీరి విమర్శనా కౌశలము మాత్ర మత్యద్భుతము, ఇంతవఱకు తెలుగుభాషలో నిట్టి

తీవ్ర విమర్శకులు పుట్టియుండలేదు. సాక్షి 1-వ సంపుటములోని బొమ్మలాట, (2) సారంగధర నాటకములోని పాత్ర పోషణము నటనాభినయములమీది వ్రాత చాల వింతగా పామరుల నాకర్షింపగలదు. సాక్షి 2-వ సంపుటములోని కష్టాంత నాటకములమీద విమర్శనము చూడదగినవి. నాటకీయ రచనకి బ్లాంక్ వెర్సు కావలయునని, ప్రకృతి విరుద్ధముగా నాటకముండరాదని చాలా నిదర్శన పూర్వకముగ నిరూపించియున్నారు. తర్వాత వీరి సాక్షి ఆరవసంపుటములోని (1) భవభూతి, (2) ఉత్తరరామచరిత్రము, (3) టాజమహాల్ అను వ్యాసములలో శ్రీవారి విమర్శనము చాల వివేకసహితముగా నున్నది. అట్టి విమర్శనము చాలా మెచ్చదగి, ఆంగ్లభాషలో మిక్కిలి పేరుగొన్న రస్కిన్, స్టీవెన్‌సన్, పేటర్‌సన్ మొదలగు కళాదర్శక జీవనులగువారే వైఖరులు ద్రొక్కియున్నది. అట్టి విమర్శనము, విశేషముగా గ్రంథసముదాయము పఠించి మించిన రసార్ద్రహృదయుడు కాని చేయనేరడు.

ముగింపు

ఆంగ్లేయభాషలో 'ఎస్సే' అను దానికి సరిపోవురీతిగా మనవారు వ్యాసములను వ్రాసియుండలేదని నాతలంపు. అందు ముఖ్యముగా పానుగంటివారి వ్యాసములు కేవల ముపన్యాస ధోరణిలోనున్నవి. దానికి కారణము లేకపోలేదు. ఆంధ్రదేశమున చాల విషయములందు సంస్కరణము కావలసియున్నది. పానుగంటి నరసింహారావుగారు కవితాహృదయులైన కారణముచేత, కొలది యిడరాని వుద్రేకములో తన్మయులై చెప్పివున్నారు.

అదిగాక వీరి సాక్షి ఆంగ్లేయభాషా జన్యమైనను, తెలుగుతనము నేమాత్రము కోలుపోలేదు. సాక్షియందు వస్తువు ఒకటి కాకపోయినను చక్కని పరమార్థ నిర్వాహణ మున్నది అదిమాత్ర మొక్కొక్కప్పుడు వెల్లివిరియు హాస్యరసములో నంతర్లీనము చెందుచూ వచ్చినది. కాని యిందలి వచన రచనా విధానములో, నేకరీతిని సాగు పోకడ కొంచెము భంగించినది. కొన్నిచోట్ల సమత్వము బేలెన్సు భావోద్రేకముచేత చెడినట్లు తోచును. అటులనే మరికొన్నిచోట్ల సందర్భమువిడిచి, అతిధోరణి కనుపించుచుండును.

కాని పై నెఱసుల నంతగా పాటింప నవసరము లేదు. తెలుగులో వీరి సాక్షినిబోలు ఒకానొక నూతన రచనమునకు దారి చూపిన వారు లేరు. వీరికి ఆంధ్రవ్యాసరచయితలందగ్రస్థాన మిచ్చితీరవలయును. వీరేశలింగం గారి సమకాలమున వచ్చిన కవులలోగాని వచన రచయితలలోకాని వీరివలె గొప్ప వార్తతో వచ్చినవారు లేరు. వీరి సాక్షి సంపుటములలోని ప్రతివ్యాసము, మానవునకు వికాసముకూర్పకల సామర్థ్యముకలది. కావుననే వీరికి వ్యాసరచయితలలో ముఖ్యస్థానము లభించినది.





# విషపుసీసాతో విడాకులు

రచయిత:

వి. వి. యస్. ప్రసాదరావు, బి. ఏ.

ఆమె ప్రకృతివిచిత్రం. ఆమె నర్తకిగాయకి ఆమె ఖ్యాతి దేశదేశాలు మ్రోగిపోతూంది. చక్రవాకపక్షి మేఘుణ్ణి ప్రేమించినట్టుగా, ఆమె నవీనుని కాంక్షించింది. అతను గొప్ప తత్వవేత్త. కళోపాసి. ఆమె సుందరాకృతిలో అతనికి ప్రకృతి అంతా కళామయమే.

సంధ్యాసమయం. ఆమె తనమందిరంలో ఒక సోఫాపై కూర్చుంది. గదిలో ఒకపక్క అంతా చిత్రాలంకారశోభితం. రెండవపక్క దిగంబరత్వం—తెల్లగోడల వెఱ్ఱిచూపులు. ఆమె కూర్చున్నసోఫా మెత్తనిదే; కాని పైన పులిచర్మం కప్పబడఉంది. ఆమెజడ పొడుగాటిదే; నల్లత్రాచులా ఉంది. ఆమె చూపులు సుందరం; నిశితం. ఆమె పాల బుగ్గలు అమృతకలశాలు. కాని విషలిప్తం. ఆమె మందహాసం మధురం; కాని కర్కశం.

గదిఅంతా నిశ్శబ్దం. ఆమె వీధివైపు శూన్యంగా చూస్తోంది—చేతిలో ఉత్తరంకేసి చూస్తో ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది... ఒక్కసారి ఉలిక్కిపడింది- దేహమంతా ఒక్కక్షణం చలించింది. మరల ప్రశాంతంగా గుమ్మంవైపు చూచింది- గుమ్మంలో నవీనుడు ప్రత్యక్షం. అతను నెమ్మదిగా ఆమె దగ్గరకువచ్చి. ఎదురుగా కూర్చున్నాడు: ఒక్కసారి ఆమెకేసి దీర్ఘంగా చూచాడు-

ఆమె తలవాల్చింది—

'రేఖా,' అంటూ, అతను ఒక చిన్న సీసా తీసాడు. ఆమె అతనివైపుచూచి త్రుళ్ళి పడింది: మొహం వెలవెలపోయింది.

'ఈసీసా నీ బొట్టుపెట్టెలోఉంది. ఇది నీకెక్కడిది రేఖా?' అన్నాడు నవీనుడు.

'............' ఆమె అతనివైపు శూన్యంగాచూచింది—ఆమె ముఖంలో కత్తివేటుకైనా నెత్తురుచుక్కలేదు.

రేఖా! యిదిఘోరమైనవిషం. దీనిమీద బొంబాయి మెడికల్ ఫరమ్ వాళ్ల పేరుంది. నీకెలావచ్చింది.?

ఆమె మౌనందాల్చింది—అతను అప్రయత్నంగా జారిన ఆమెపైటవైపుచూచాడు-బాడీలోనుంచి ఉత్తరంసగం కనిపిస్తోంది. ఒక్కక్షణంలోలాగేసి చదివేసాడు. సమయం మించింది. ఇంక భయపడనవసరంలేదనుకుంది రేఖ. పూర్తిగాధైర్యంవహించింది- భయంకరవ్యాఘ్రంలా రోజుతూ అతనివైపుచూస్తూ నిలబడింది.

ఒక్క త్రుటికాలం గదిఅంతా నిశ్శబ్దం- నవీనుడు లేచి నిలబడ్డాడు. అతని శరీరం కంపించి పోతూంది. అతనితల్లో మోటార్లురైళ్లు గిరగిరా తిరుగుతున్నాయి.

'రేఖా ?'

ఆమె మౌనందాల్చింది.

'రేఖా, ఎవరీ దేవదాసు ? అన్నాడు నవీనుడు.

'అర్థుడై రక్తరు' అంది నెమ్మదిగా రేఖ.

'నీ వతనిని ప్రేమించావా?'

ప్రత్యుత్తరం మౌనం......

'రేఖా నీవు నర్తకివి. నీకీర్తి దేశమంతా వ్యాపించింది. నీవు సామాన్యుణ్ణి నన్ను ప్రేమించి వివాహంచేసుకొని గొప్ప త్యాగం చేసావు. నీకు నే నెప్పుడూ కృతజ్ఞుడనే.

'...........'

రేఖా, నీ మనస్సు కష్టపెట్టుకోనకు. నీ హృదయాన్ని శాసించుటకు నాకెట్టి అధికారంలేదు. నీవు సంపూర్ణంగా స్వేచ్ఛానువర్తివి. నీ కాతనియం దిష్టముంటే వానిని పెండ్లి చేసికోవచ్చును.'

రేఖకాతని ధోరణి అర్థంకావడంలేదు తనలో ఏదో ఆవేదన కలుగుతోంది. కాని ప్రయత్నంమీద అణచిపెట్టింది.

'రేఖా, నీ వివాహమునకు నాకెట్టి అభ్యంతరమూ లేదు.' అని నవీను డామెకేసి చూసాడు.

'విడాకులో' అని నెమ్మదిగా గొణిగింది రేఖ.

'ఇవే'...అంటూ నవీనుడు విమం నీసా చూపించాడు.

మైనపంట నువ్వులు. ముఖ్యమైన పరిశ్రమ తైలంతియ్యటం ముఖ్యమైన వ్యాపారం కట్టెలు. వ్యాసుడినాటి కింకా రాక్షసిబొగ్గూ హైప్రెషర్ స్టీమూ లేవు. ఎలెక్ట్రిసిటీ బొత్తిగా తెలియదు.

యమధర్మరాజు శిక్షలివ్వటంలో నిధి. 'పదివేల అర్బుదాలు కుంభీపాకం,' 'పన్నెండు వేల అర్బుదాలు రౌరవం,' 'ఇరవైతొమ్మిది వేల అర్బుదాలు పుం.' (ఈ పుం అనేనరకం ప్రత్యేకంగా ఆర్యఋషులు ఏర్పాటుచేయించినటువంటిది. ఆరోజుల్లో ఆర్యులసంఖ్య భూమిమీద క్షీణించసాగింది. అందుకని పిల్లలు లేని ఆర్యులకు బుద్ధివచ్చేటందుకు ఆనరకం ఏర్పాటుచేశారు. ఆర్యులేం వెర్రివాళ్లా? తమకు పిల్లలు పుట్టకపోతే మరొకరకంగా పిల్లలను పుట్టించుకుని, ఎనిమిదిరకాల పుత్రులను లీగలైజుచేసి పుం నరకాన్నుంచి తప్పించుకున్నారు. ఇందువల్లనే ఆర్యరక్తం ఏకోశానా లేని మనమంతా బ్రాహ్మలమని చెప్పుకుంటూ ఒకరికొకరం 'ఆర్య' అని ఉత్తరాలు రాసుకుంటున్నాం.)

రానురాను యమధర్మరాజు ప్రకృతి అతి విచిత్రంగా మారిపోయింది. మొదట్లో మనుష్యులను శిక్షించటం తనకు ఇష్టంలేనట్టూ కేవలమూ న్యాయబుద్ధిచేత తప్పనిసరిగా శిక్షలు విధిస్తూ ఉండేనట్టూ నటించేవాడు. కాని కాలక్రమాన ఇదిపోయింది. ఏరోజున శిక్ష విధించేటందుకు జనంలేకపోతే ఆరోజు అతనికి దుర్దినంగా ఉంటూవచ్చేది. భూమిమీద పుణ్యం జాస్తిఅయి నరకకూపాలకు పంపేటందుకు మనుష్యులు లేకపోతే ఈ యమధర్మరాజు ఇతర దిక్పాలకులతో మొరపెట్టుకుని ఏవిష్ణుమూర్తిదగ్గిరికో వెళ్ళి భూమిమీద పుణ్యంతిగ్గేమార్గ ఏర్పాటు చేయించుకునేవాడు. *

ఇందుకు కేవలమూ యమధర్మరాజునే మనం దూషించనక్కర్లేదు. ఎందుచేతనంటే ఆర్మమెంటు మాగ్నేట్స్ కొన్ని మిలియనుల పౌనులకు ఆయుధాలుచేసి కూర్చుని యుద్ధమంత్రిగారిని ప్రేరేపించి యుద్ధంచేయించినట్టే, నరకంలో నూనెకూ కట్టెలకూ లాభకరమైన టెండర్లమీద కంట్రాక్టు తీసుకున్న మహనీయులు ఆనూనె కట్టెలయొక్క వాడకం సరిగా జరగనిపక్షాన యమధర్మరాజును బతకనిచ్చేవాళ్లు కారు.

అంతే! అంతవరకు మనం ఊహించగలుగుతున్నాం పురాణాదులనుబట్టి మొన్నమొన్న మన స్పిరిచుఅలిస్ట్సు పోయి చూతురుగదా యమలోకం పూర్తిగా మారిఉంది. ఎక్కడా నరకకూపాలు లేవు. యమధర్మరాజు లేడు. నువ్వులపొలాలు లేవు. కట్టెల అడితిలు లేవు. మట్టిలాగులవాళ్లు లేరు. చిత్రగుప్తుడు లేడు. హిందూమత పక్షపాతమూ బ్రాహ్మణ పక్షపాతమూ లేవు. శిక్షలు లేవు. యమధర్మరాజు స్థానే ఒక దివ్యపురుషుడు నిశ్శబ్దంగా పనిచేస్తున్నాడు. యమలోకం యావత్తూ సుఖమయంగా ఉంది. పాపాలుచేసినవాళ్లు రోగులమాదిరిగా తమకుతామై అక్కడి వైద్యులదగ్గిరికిపోయి చికిత్సచేయించుకుంటారు. నరకకూపాలస్థానే అక్కడ ఆసుపత్రులు వెలిసినై. ఇక్కడి వైద్యులు విశ్వప్రయత్నాలుచేసి కనిపెట్టలేకుండా ఉన్న రహస్యం అక్కడివైద్యులు కనిపెట్టారు— ప్రతి పాపమూ ఒక విధమైన రుగ్మతేనని! అంతే కాదు ఈపాపాలకి చికిత్సకూడా కనిపెట్టారు.

---

* ఇది నమ్మలేనివాళ్లు నేషనల్ మూవీటోనువారి 'రుక్మాంగద' చూతురుగాక! (ఆం.సం.)

ఈ నాలుగైదువేల సంవత్సరాలలో ఇంత మార్పు! ఈమార్పు నమ్మటానికి వీలులేనిదిగా కనిపిస్తుంది చప్పున చూడటానికి కాని జాగ్రతగా పరిశీలిస్తే ఈమార్పును సూచించినవారు ఈమధ్యకాలపు కవులలో ఒకరిద్దరు లేకపోలేదు. ఇటలీలో దాంతి అని ఒక పొలిటీషియన్ ఉండేవాడు. ఈయన ప్రతిపక్షులు ఈయన్ను కనపడినచోట నిలువునా కాల్చివేయవలిసిందిగా ఒక శాసనం చేశారు. (అప్పుడు వాళ్ళదీ మెజారిటీ.) అందుమీాదట ఈదాంతి కోపంవచ్చి 'డివైనా కామెడియా' అని ఒకగ్రంథంరాశాడు. ఆ గ్రంథంలో తనకిష్టంలేనివారి నందరినీ నరకకూపాల్లో తోశ్కాడు. ఆగ్రంథం రాయటానికని ఈ దాంతి బొందితో నరకానికి వెళ్ళివచ్చాడని ప్రతీతి. ఆయన్ను వార్ధక్యంలో చూసినవాళ్లు 'అడుగో నరకానికి వెళ్ళివచ్చినవాడు!' అని చెప్పకుంటూ దూరంగా తొలిగిపొయ్యేవాళ్లుట. ఇంతకూ ఈ దాంతి తన పుస్తకంలో 'పర్గేటరీ' అనే ఒకవిధమైన ఆసుపత్రి ఒకటి నరకంలో ఉన్నట్టు రాస్తున్నాడు.

మిల్టన్ అనే మరొక ఇంగ్లీషుకవి 'పారడైజ్ లాస్ట్' అనే మరొక గ్రంథంరాశాడు. ఈయనకూడా నరకకూపాలను వర్ణించాడు. ఈయనకూడా నరకాన్ని స్వయంగా చూచి వచ్చినట్టు కనపడుతుంది. కాని ఈయన వర్ణనలు మనం సంపూర్ణంగా విశ్వసించటానికి లేదు. ఏమంటే ఈయన గుడ్డివాడు. (అందుకనే 'కాంతిలేని జ్వాలలు' అంటాడు. ఆయనకు వేడి తెలుస్తుందికాని కాంతి కనిపించదు.) ఇంతకూ ఈమిల్టన్ తన గ్రంథంలో నరకంలో ఒక విప్లవం జరిగిందని స్పష్టంగా సూచించుతున్నాడు. ఆసమయానికి అక్కడ సోషలిజం వచ్చిఉండిం దనుకోవచ్చును.

మన సమకాలికుడు జార్జి బెర్నార్డుషా 'మాన్ అండ్ సూపర్‌మాన్' అనే నాటకంలో నరకం చాలా సుఖప్రదమైనచోటని చెబుతున్నాడు. దీని కేమీా సందేహంలేదు. నరకానికి అధిపతిగా భావించబడే మెఫిస్టోఫిలిస్ అనే పెద్దమనిషియొక్క మాడు మూర్తులూ అయిన షానరకాన్నిగురించి తెలిసే చెబుతున్నా డనుకోవాలి.

నరకంలోకూడా భూలోకపు రాజకీయాలు తప్పవా అని అనుకోవద్దు. స్వర్గానికి వెళ్ళినా తప్పని విడాకులు నరకంలో ఏంతప్పతవి గనక ?

# నేను

ఈసభాభవనాన నేనెపుడొ కాని,
పాడినట్టులె నాకు జ్ఞాపకముకలదు—
ఈ సభాసింహపీఠి నన్నే వరించి,
యెప్పుడో బానిసేని గావించుకొనియె—

* * *

ఈ సుధానిధి నడచు మధ్యేపథాన
మబ్బుతునుక లప్పుడు మరుగుపఱచు—
తొలగిపోవును. పరిణామదశలలోన
ప్రాపులోపింప భ్రష్టమర్యాదతోడ—

* * *

గాయకుడ నేను : నవ్యరాగములనిచట
నాలపింతును, లోకమునాలకింతు—
సత్కవిని నేను : కవితాప్రసారమిచట
జిలుకరింతును, లోకము దొలుకరింతు—

—ప్రయాగ కోదండరామ.

(యువభారతీసభ.)



# విజిటింగ్ కార్డు


రచయిత:

అత్తివి సూర్యనారాయణమూర్తి.

(శ్రీరవీంద్రసారస్వతసమాజం)


౧

నాల్గుఘడియలకంటె పొద్దెక్క లేదు. గండకీ నదీజలాలు పేరుకుపోయేవున్నయి యింకా. ఇప్పుడిప్పుడే లేకిరణాల గిలిగింతలతో యఱవిడ్డ అరవిందనేత్రాలల్లోకి చూస్తూన్నాడు భాస్కరుడు. వెండీ బంగారు కఱిగి కలసికొంటున్నాయి హిమవత్పర్వత లోయల్లో.

ద్రాక్షకుటీరంముందరి గుత్తులపై ఒయ్యారాలొలికిస్తూ తోకాడిస్తూన్న బంగారుపిచుక కిచకిచలుతప్ప అంతా, భరింపలేనంత ప్రశాంతం.

మందపాలుడు అప్పుడే మంచులో స్నానంచేసి కుడిచేత్తో రాగికమండలం, ఎడమ చంకలో తపోదండం వుంచుకొని, దారుపాదుకలతో కుటీరాన్ని చేఱుకుంటున్నాడు. అతని తపోవేడి ఆరాగిజుత్తులోంచీ, మెఱసేగడ్డంలోంచీ, విశాల వక్షంమీద బొట్లుబొట్లుగా జాఱి, నేలకువచ్చేలోవుగా యశోవిరాజితమైముత్యాలుపఱచింది దారిపొడుగుతా.

అరనైదాటి డెబ్బైయో పడిలోని మనిషి. తెల్లగావుంటాడు. కుటీరంలోని వ్యాఘ్రాసనాన్ని దులిపి అరుబైట వేసికోవాలని. నాల్గుమూలలా గలగలా, కిచకిచా, పలపలానూ. ఆనవ్వులలో దేవపారుజాత వాసనలు గుభాళిస్తున్నాయి. చేతనున్న వ్యాఘ్రాసనాన్ని అల్లాగే పట్టుకొని తొంగిచూసాడు. చిన్నాపెద్దా ఓ! ఒకటేకోలాహలం. అంతా అక్కడినుంచే పోతున్నారు బాఱులుకట్టి. ఓముసిలాయన చెప్పడం; ఆమాటలు సాంతంగాకుండానే యితరుల హాస్యాలల్లో లీనమవటం.

'ఏమిటిది అంతా?'

'...............'

'ఇదిగో! మాతంగమునీశ్వరులూ వున్నారే!...ఏమండోయ్ తెల్లారకుండానే యెక్కడినించీ రాక?'

ఒక్కసారిగా మళ్లా అంతా నిశ్శబ్దం.

'మందపాలాశ్రమానికి వచ్చామురా!... మందపాలఋషీ! ముక్కోటికదూ యీవేళ మరీ!'

'అయితే?' విశేషాన్ని ఎఱుంగబోయే ముఖాన్ని కనబరుస్తాడు మందపాలుడు.

'ఈవేళ సాక్షాత్తు బ్రహ్మగారు అధ్యక్షత వహిస్తున్నారు స్వర్గంలో. వేదార్థాల్ని చర్చిస్తున్నారు; అత్రీ ఘులహస్తుడున్నూ. మీరేం

ఎఱుగనే ఎఱగరా ఏమిషీ?'

'అల్లాగా? ఇదుగో;......వుంటారా కొంచెం నిత్యవిధుల్ని తీర్చుకొనేదాకా?...... నేనూ వస్తాను.'

'ఇంతకన్నానా!......మీరూ...రూ...'

'ఏమండోయ్, గురువుగారూ?...అను... కొన్నం... ఆ...'

'చూసారూ! మరచేపోయ్యాను. మా శిష్యుల ప్రసంగం...కూడా...వుంది లేండి. కొంచెముందుగా, సెలవిప్పించాలి.'

'ఓహో! అల్లాగా...సరిసరి...మాంతంగ ఋషీ కలసికొంటాంగా——సెలవు.'

మళ్లా వేదఘోషా— కిలకిలలూ— చీమల బారులా అంతంతలో ఆహిమకరళ్ళలో వియత్పథాలంటి సలుసులై పోయారు.

౨

మాంచి మణికాంతిని స్తున్నాడు సూర్యుడు పదిగంటలలోపు. కొండచిలవల్లా వున్నాయి వీధులూ; అరణ్యలనిండా ఒత్తుగా పఱచిన మల్లెలూనూ. ఎత్తయిన పాలరాతిగోడ పురాన్ని రక్షిస్తోంది. బంగరు కవాటాని కిరు పక్కలా చైనాసిల్కు దుస్తులతో పేంబెత్తాలను, నేలకానించి నుంచున్నారు, నడివయసు కాంగ్రిద్దరు.

'ఓం...' వీణారావం. ఘాటు మీదున్న ద్వార రక్షకుల భుజాలలంకరించాయి పేంబెత్తాలు. ఒకరికెదురుగా ఒకరు నిలబడ్డారు నిలువు గీతల్లా.

పూలపల్లకీ——మయాన్ని తుమ్మెదరెక్కల్లా కొంచెం గుబురుగావుండి పక్కలకు వెళ్ళినకొద్దీ కనపడకుండా పోయే శ్మశ్రువుల లోంచి, లేతవెన్నెల గురిసే హాసంతో, బంగినపల్లి మామిడిపండులాంటి తనుఛాయలూ కల్గిన, అయిదడుగుల ఆరంగుళాల, వలుబడి వేళ్ళకు మించన ట్లగుపిస్తూ, తేజాలొలికించే మొగంనిండిన కళ్లుగల ధీరుకొకణ్ణి పట్టు దుస్తులతోనున్న బోయీలు మోసికొని ఆ సువర్ణ కవాటాన్ని దాటుతున్నారు.

టక్ టక్ సాల్యూట్.

'అర్థతలేండే లోనికెవ్వరూ రాకూడదు ...వాహనాలన్నీ... బమ్మగారు... తక్క—— ఇక్కడితో ఆగడమే.'

'చిత్తం——దేవేంద్రా' మహారావారి జోహారులు.

మళ్లా ఒకఅడుగు వెనుకకేసి ఎప్పట్లా గోడకానుకొని నిలబడ్డారు.

ఋగ్యజుస్సామాథర్వణ వేదఘోషనలు మొగాలనిండా విభూతి పిండికట్ల బ్రాహ్మలూ, కోరమీసాల రాజకుమారులూ, కుభేరాది వైశ్యులూ, దానకర్ణుల్లాంటి కడసారి కొడుకులూ, అరుంధతీ హరిజన కూతుళ్లూ వెంటరాగా, మిలమిలలాడే డక్కామజిలిన్ల వెలిదుస్తులలో, యిట్టిలేని యిందుబింబంలాంటి శరీరంగల ధాత తాతను, మేఘగంభీర గమనంలో వస్తూన్న వెల్ల అంచ ముఖాకృతిలోనున్న డబుల్‌యింజన్ విమానం [రాయుంచపేరు] స్వర్గకవాటానికి అల్లంతలో దిగి మోటారై, అపూలదారిపై, లోనికి తీసుకువెళ్ళింది; దేవేంద్రాదుల ప్రత్యుత్థానంతో.

ఏనాటివాడో అయినా అంతగా వయస్సు తెలియనీని దృఢకాయం. డక్కామజిలిన్ యాభై మూరల తలపాగా సంతెనాగా కుదిరింది; విరిసిన 'వైట్‌లజర్స్'మియూ'ల మొత్తంలా శూన్యాలల్లో చొచ్చుకొనివుంది... మీసాలే లేవుమరి.

ఒక్కొక్కరే గడ్డాలవారూ, పట్టుకుచ్చుల వాళ్లూ, జంటనిమ్మపళ్లు నిలచేలా మెలిపెట్టిన మీసాల దొరలూ, వారూవీరూ ఏమిటి, అందాలచుక్కలు స్త్రీలూ పురుషులూ పప్పుబియ్యంలా కలసినడచారు లోనికి. ఒక్క అరగంటలో ఆదారిఖాళీ. కలరుతాలు సన్నని మార్దవ మృదంగస్వనాలల్లో, చిఱుమువ్వల మోతల్లో స్నేహచవులను పరిమళించేస్తున్నాయి.

పులితోలు భుజమూలాన్ని వేలాడుతోంటే, కమండలంలోని చల్లనినీరు తొణుకాడుతోంటే, పెద్దపెద్ద అంగల్లో జేరుకున్నాడు. గబగబా ఒక్క అడుగులో ఘారావారి నిర్దిష్టప్రదేశాన్ని దాటేవాడే!

'ఓమునీశ్వరులుంగారూ! ఆగండి.'

'ఏం'

'చెప్పకుండా.. లోనికే!'

'చెప్పేదేమిటి ఉండండి. అబ్బా అవతల దాటిపోతూంటే ఊరికే...'

'అల్లా కాదు– తొందరపడి లాభంలేదు'

'ఏమంటారు మరీ.'

'స్వర్గద్వారం యిదీ—'

'అయితే'

'మీరెవరో'

'నన్నా . . మందపాలు డంటారు'

'మీ తాహతు?'

'అంటే'

'మీ బిరుదులూ అవీ వ్రాసియిస్తే'

'తర్వాత'

'అర్హతనుబట్టి...'

'అయితే...స్వర్గంలో...'

'ప్చ...అవన్నీ తమరు...అడగా–కూడదు...మేం...'

'సరే యిదిగో' ఓచిన్నపత్రంపై ఏమో వ్రాసియిచ్చాడు.

'............'

'క్షమించాలి...వీల్లేదు'

'నాకేనా?...నాముందు యింకా వెళ్లారే!'

'వారంతా సంతానవంతులు!'

మందపాలుని శిరస్సు దిమ్మెక్కిపోయింది. 'ఇదిఒక అర్హతా? బిడ్డలులేనివారికీ స్వర్గంలోనూ అడ్డుందా!' అతడామంచుశిఖరాల్నించి జల్లున జారిపోయాడు ఆవిస్మయ హతాశల్లో. మందపాల గృహిణి, హిమాంబువుల్ని చల్లిందాతని ముఖంమీద. తెప్పలర విచ్చాయి. ద్రాక్షతీవ పొదరిల్లూ, గండకి జిలిబిలిస్వనాలూను. అతడట్టే ఆలోచించాడు. స్వర్గమణి మందిరాలలో, కిన్నెరీ స్వనాలింకా రేగుతున్నట్టే ఎంచాడు. సరే– తానున్న స్థలానికీ, స్వర్గానికీ కాలభేధమెంతేని కలనుకదా! ఇక్కడ సంవత్సరం వారికిరోజు.

'లపితా! ఏమైనదో తెలుసునా?'

'మీరు నేను నీరుతెచ్చేసరికి వెల్లకిలా బడివున్నారు...'

'అదా! సంతానంలేదని. .ద్వారపాలురు..'

స్త్రీ కింతకంటె ఏంకావాలి! ఆమె మాటాడలేకపోయింది. ఓక్షణానికి.

'మీరు మహాత్ములుగదా!'

మీనమేషాలు చూసాను.

'నీ వంగీకరిస్తే.'

'మీయిష్టమెట్లో అట్లే'

3

మధ్యాహ్నం మూడు ఘంటలు.

వేదార్థాల్ని వివరిస్తూన్నారు అత్రీ పులహ

స్తుమాను. గార్గిశ్ళతసౌమిత్రా చూపేమెలు గులు యిదివరలో యేస్త్రీ, స్త్రీ అన్నమా టేమిటి పురుషుమూచూపలేదు అనుకుంటు న్నారు సభ్యులంతా.

హడావుడిగా ద్వారపాలుడొకడు దేవేం ద్రుని పక్కకుచేరి నమస్కరించాడు. దేవేం ద్రునిచేతిలో చిన్నపత్రంపుంచబడింది.

'ఏమిటి కథ?'

'ఉదయం అర్హత లేదంటే వెళ్లిపోయ్యారు మళ్లాయీపూట'

'ఊ..వచ్చి?'

'వుందో లేదో మీ దేవేంద్రులవమగ...'

'అత్రిమునీంద్రా! సంతానంలేనివారిని లో నికి రానీయకూడదని స్వర్గ రెగ్యులేషన్సు మూ డవ రూలు...అ'

'చిత్రం'

'ఈమందపాలు డెవరో ఋషిఅట! ఉద యంద్వారపాలురచే వెళ్లగొట్టబడి... యీ పూట—తిరిగివచ్చాడు. ఈతని నెఱిగినవారు న్నారా?'

'నే నెఱుఁగుదు'నన్నాడు మాతంగఋషి.

'ఈతడు...సంతానవంతుడా?'

'మహా తపశ్శాలి...'

'అదికాదండీ...సంతానం మాట'

'నేనెఱిగున్నంతవరకు— కాదు...బ్రహ్మ చర్యం అసిధారావ్రతం...'

'నలుగురు సంతానం, కొడుకులే అం టాడే!'

అంతా చకితులౌతారు—గుసగుసలు.

'బృహస్పతిగారూ! దీని కేమంటారు?'

'జయంతి మహలులో నున్న యంత్రంలో నుంచి తెలుసుకోవచ్చు'

'అదేదో తమరే...'

బ్రహ్మగారు పడకకుర్చీకి అంటిపెట్టుకొని ఆచల్లని ప్రాంగణంలో అన్నా చెప్పక విం న్నా చెప్పక అల్లాగే వుండిపోయ్యారు. అం తా బృహస్పతిగారి రాకకై చూస్తూన్నారు. వేదాలూ, వేదార్థాలూ ఎక్కడివక్కడే! మూడు నిముషాలుకంటె ఎక్కువ పట్టలేదు. బృహస్పతిగారు వచ్చేసారు.

'ఆ (నలుగురూ కొడుకులే'

'ఎల్లా గెట్లాగూ' ఒక్కటేప్రశ్నదీర్ఘం.

మాతంగాదుల ఆశ్చర్యానికి మేరేలేదు.

'నాల్గుమగపిట్టలు' అన్నాడు బృహస్పతి.

'పిట్టలా?' శ్రీకంఠాలూ కలసిపోయాయి రెండవప్రశ్నలో.

'అవును'

'ఎట్లూ?'

'మందపాలుడు, మనద్వారపాలురు గెంటె య్యగానే మర్త్యదేశానికి వెళ్లిపోయ్యాడు. మనుష్యులలో స్వల్పకాలంలో సంతానోత్ప త్తికాదని, తనమేధాశక్తిచే, లావుకపిట్ట అయి, జఱితఅనే మరో ఆడపిట్టతో జంటక ట్టాడు. ఆజఱిత, నల్గురుకొడుకుల్నికంది మన ఖాండవ వనంలో'

'మన ఖాండవవనంలోనే!?'

'అవును. ప్రతిఅంశమూ మనయంత్రం, రికార్డు, ఫొటోగ్రాఫీలోవున్నయి'

'తెలివైన నఘటం!! అంటే తెలివైన నఘటం కాదుట్రా, ఎంతికైనా......' అను కున్నా రంతాను.

'ఇంతకీ పులుగుసంతానంకని, మానిసి స్వర్గంజేరవచ్చునా?'

దేవేంద్రునిశంక.

ఒకర్నొకరు చూసికొంటున్నారు. సభ అంతాఘనుప్కొటిసముద్రంలా విఱుచుకుపడుతోంది. బ్రహ్మగారొకసారి అవుళించి చేతులు కుర్చీపైకిపోనిచ్చి ఒళ్లుకొంచెం విఱిచికొన్నాడు. ఆయనేదోచెప్పుతారని అంతానిశ్శబ్దం వహించారు. ఇన్నాళ్లకి యింతసేపటికి ఆమహనీయుడు మౌనంవిడిచాడు. దేవేద్రాదులు రెప్పవాల్చకుండా వున్నారు.

'ఫలానా సంతానమని మీరూహల్సలో లేదు. మందపాలుడు నిశితబుద్ధిగలవాడు—కనుకనే దేవేంద్రునిరూహలనకు సరిపడ్డట్టుగానే మెలిగాడు. అతని సంతానం శాస్త్ర వ్యతిరిక్తం అనడమెట్లాగు. కాదు. అసలు స్త్రీ అనేదేలేకుండా సంతానోత్పత్తి అయేమార్గానికి పునాది :— మందపాలుని జన్మాంతర సంయోగంవల్ల కల్గిన యీశార్ఙ్గకులు.' బ్రహ్మవాక్యం.

౪

బ్రహ్మగారి తుదిపలుకులలోనితీపి ఆపెదవులపై ఆరకమునుపే ద్వారపాలుడు ఒక్కవురుకున వెళ్లటం, మందపాలుడువచ్చి కుర్చీ అధిష్ఠించడం అయిపోయింది. దేవేంద్రునిముఖలక్షణాలవల్ల అతనికి యీతీర్పు అశనిపాతం లాగున్నట్లు కందగడ్డ అయిపోయిన అతనిముఖం చెప్పింది మందపాలునితో. మళ్లా వేదప్రామాణ్యాలూ, అధర్వణవేద తార్కాణాలూ ఆరంభం అయ్యాయి. మందపాలుని పక్కనే అగ్నిఆసనం, ఆపక్క గాలి. అగ్ని గాలితో అంటున్నాడుకదా.

'ఈదేవేంద్రునికీ నేనొకణ్ణిదొరకాను, హవిర్భాగాలు తెచ్చేందుకు. వాళ్లిళ్లలో, పిల్లిళ్లలో తినే తిళ్లకు ఆఖరికి యీవిడువని కడుపునొప్పిఫలితం. ఏంతమ్ముడూ! ఏమిచేసేది ?'

'ఏమో—ఏమిటో...ఉండు...నీపక్క ఆయనవింటున్నట్టుంది'

'మీమాటలకు అడ్డువచ్చినట్లుంది...విన్నాను. నేను సలహాచెప్పి గౌరవంపొందవచ్చునా ?'—అన్నాడు మందపాలుడు తన కుర్చీలోంచివంగి.

'ఇంతకన్నానా'

'మీకూ దేవేంద్రుని వల్లే కష్టమనుకుంటాను'

ఒకరిమొగం ఒకరుచూసుకొని తెలతెలబోతున్నారు.

'సరే...ఏదైతేం—ఓ వుపాయంచెప్తాను వింటారా—మరి ?'

'చెప్పండి...'

'ఖాండవవనంవుందే! దాంట్లో యితరులు గ్రహించలేని వనమూలికలున్నాయి. అవి ప్రత్యేక ప్రదేశాలలో నాటబడ్డాయి. వాటిని వున్నవి వున్నట్లు భూపుటంవేసి లోనిభస్మం మట్టిసహా తెస్తే మీకడుపునొప్పికి మందవుతుంది'

'అదెట్లాసాధ్యమవుతుంది'

'ఎల్లాగా ? వనం అంతాదహిస్తేను'

'అమ్మయ్యో!!'

'ఇంతేనా...దీనికేనా దేవేంద్రునిపై కోపం తెచ్చుకొని మాట్లాడుకుంటోంట ?'

'బాబోయ్ ! ఘట్టిగాఅనకండి...వీలవుతుందా అని'

'ఆకథ నాకువదలండి. ఒక్కదెబ్బకు రెండుపక్షులు. ఆఁ...చూడనివ్వండి...సరి. యిప్పుడు ఆవనందగ్గర వాళ్లలో చాలామంది యిక్కడేవున్నారనుకొంటాను. చూడండీ ఆ

తోటలోని ప్రతిచోటులోనూ విచ్చలవిడిగా వున్నాయి విద్యుచ్ఛక్తితీగలు. వాటియింజను గది కివతలవున్న ఫ్యూస్‌నుండి వెళ్లే ఆశక్తిని పక్కనున్న మీట ఏపింగాణీముక్కతోనో తిప్పేస్తిరా, మీకాభస్మం అరగంటలో పూర్తి.'

'వనం నశింపుకావల్సిందే ?'

'మీయిష్టం—వ్యాధినివారణకు అదే దారి. సరిగ్గా నెరవేర్చుకోలేరా అజామిత్'

'సరే'

'ఒక్కటుంది. తూర్పుపక్కసామూల నా బిడ్డలున్నారు. మంటలాపక్కకు వెళ్లకుండానే దేవేంద్రునకు మీరే తెల్పాలి. నిప్పులార్పే యింజన్లను పంపేటట్టుచూడాలి. నాపిల్లల రక్షణ లేమరకూడదుమీరు.

'మీకు కృతజ్ఞుణ్ణి. చావసిద్ధంగావున్న నాకు బాధానివృత్తికి తెల్పిన మీసలహాకు, మీపిల్లల్ని రక్షించడంలో తీరదునాఋణం'

'నేను పోయివత్తునా' అని మందపాలుడు ఆప్రదేశాన్నించి వేళాకమూల వేడుకలలో లీనమయ్యాడు.

✻

గండకీ నదీజలాలు పేరుకుంటున్నాయి. బారులుకట్టి ఆమాటా, యీమాటా, చెప్పుకుంటూ ఆనాటి తమశ్రమాఫలితాల్ని ఎఱుకచేస్తూ గృహోన్ముఖాలయ్యాయి ద్విజసంతానం.

కొండమీదినించి పడిపోతూ దెబ్బతిని ఎఱ్ఱవడ్డముఖం తుడుచుకొన్న చేతు లందిస్తున్నాడు హేళి, అర్ఘ్యప్రదానం చేసికొంటూ పరధ్యానంగా వులిక్కిపడి లేచాడు మందపాలుడు. అప్పుడే చంకనున్న నిండు జలకలశంతో, లపిత, కచ్చాపోసిన నారచీరతో, పావులాఅంత నుదుటిబొట్టుతో, ఏదోనవ్వుకుంటూ చేరుకుంది కుటీరాన్ని.

'ఏమిటిది అల్లాలేచారేం ?'

'ఏమీలేదు'

'అల్లాకాదు...ఏదో...'

'జరితా, పిల్లలూ ఏమయ్యారో ఖాండవ దహనంలో...అని...'

'ఏం—అగ్నితో చెప్పివచ్చానన్నే అంటిరే. అతడూ మీకు అభయంచెప్పాడాయిరి...దానికేం... పక్షి...ఎల్లాగయినా...విచారించనక్కరలేదు...'

'అరుంధతి యట్టిభార్యయైనా, వశిష్ఠునట్టి పురుషునైనా సంశయింపకుండదు. ఇది స్త్రీలకు నైజం'

'ఇంతకీ బ్రహ్మచర్యం—ఆఖరికి జన్మాంతరం - చచ్చినా పోయిందికాదు - యీవెఱ్ఱి ప్రేమ.'

'సీవన్నట్లే'

'అసలుపునాది మీస్వర్గద్వారంవద్ద—లోనికి వెళ్లాలని యిచ్చిన ఆపత్రం—ఎంతెంతలు చేసిందో చూడరడి'

'సీతో మాటాడుతోంటే పుణ్యకాలంకాస్తా...జరితనూ పిల్లల్నీ కళ్లచూడాలి.'

చటచటానడచిపోయ్యాడు. అతని దారుపాదుకల టక్కుటిక్కులు ప్రశాంత వాయువులో తేలిపోతున్నాయి. లపిత ముక్కున వేలుంచుకొంది. వెండికొండపై నల్లమొగిళ్లు నృత్యంచేశాయి. బంగారు పిచ్చుక కొత్త చిన్నిపెంటితో ద్రాక్షగుత్తులమయాన్ని వ్రాలి ఒకటి పొడిచి పెంటి చంచువుగీటింది వెకిలినవ్వు నవ్వాడు రేరాజు.



స్త్రీలు పూజింపబడుచోట దేవతలు క్రీడింతురు.



# మహిళాలోకము

## పిల్లకి పాలివ్వడం మాతాశిశువులకిద్దరికీ మంచిది

చంటిపిల్లని పెంచేవిధానాల్లో తల్లి పిల్లకి పాలివ్వడం సహజమైన విధానంమాత్రమే కాదు దానివల్ల ఇతరమైన లాభాలుకూడా వున్నాయి. ఈలాభాలు ఉభయత్ర అంటే తల్లికి పిల్లకికూడా చెందినవయి వున్నాయి. తల్లి పిల్లకి పాలివ్వడం సహజమైన విధానమే కాకుండా సురక్షితమైనది కోరతగినదికూడా అయివుంది.

చనుపాలు ఆవుపాలకంటె శుచిగాను, ఆరోగ్యప్రదమైనవిగాను వుంటాయి. చనుపాలకు ఇతరమైనపాలవల్ల పెంచబడే శిశువులు ఆయాపోతపాలల్లో లోపించివుండే పోషకపదార్థాలకు మొగంవాచి ఏడ్పుగొట్టువాళ్లు అవుతారు, ఆయాపోతపాలవల్ల కొన్ని సంక్రామిక వ్యాధులకు కూడా గురిఅవుతారు.

చనుపాలు ఇట్టిదోషాలికి దూరంగా వుంటాయి; తల్లి శరీరమునందలి నిరామయపదార్థాలికి నెలవులయి వుంటాయి. అందుచేత చనుపాలు తాగే రోజుల్లో పిల్ల రోగనిరోధక శక్తిని క్రమంగా అలవఅచుకొంటుంది. తల్లి ఏయేరోగాల్ని అయితే నిరోధించడానికి శక్తిమంతురాలయి వుంటుందో ఆ తల్లిపాలను తాగేపిల్లకూడా ఆయారోగాల్ని నిరోధించడానికి శక్తిమంతురాలయి వుంటుంది. పోతపాలు పిల్లలికి ఇట్టి రోగనిరోధకశక్తిని ఇవ్వజాలివుండవు. అదిన్నీగాక వివిధపదార్థముల తయారీతో అవి కొత్తగుణాల్ని అలవరచకొనవచ్చును. అందుతో పిల్లలికి సరియైన పోషణ లభించకపోవచ్చును.

జీర్ణంచేసుకోడానికి తగిన శీతోష్ణముతో చనుపాలు సహజంగా వుత్పన్నమవుతున్నాయి. ఇతరమైన పాలు అన్నీ ఉపయోగించే సమయానికి సరియైన వెంప రేచరుతో వుండేటట్టు చేయవలసివుంది. ఈపని బహు శ్రమకరమైంది.

చనుపాలలో దేహపోషక పదార్థములు వుండవలసినస్థిలో, వుండవలసిన పాళ్ళలో వున్నాయి. జీవశాస్త్రరీత్యా అవిసమగ్రమైనవి. శిశువువానిని పూర్తిగా ఉపయోగించుకొని జీర్ణంచేసుకోగలిగి వుంటుంది.

ఇతర ఆహారములలోని వివిధపదార్థము ప్రాయికములుగా చనుపాలలోని వివిధపదార్థములవంటివే అయినను వానియొక్క సమ్మేళనంమాత్రం మానవుని జఠరరసాలులోగానే పద్ధతిలోవుండదు. కాబట్టి ఇతర ఆహారములలోని వివిధపదార్థాలను మానవుని జఠరరసం వినియోగించుకోలేదు. పూర్తిగా జీర్ణంచేసుకోలేక పోవడంవల్ల చాలాపదార్థం వ్యర్థంగాపోతుంది. చనుపాలలో ఏమిన్ని ఇట్లు వ్యర్థంగాపోవడానికి అవకాశంలేదు.

చనుపాలుఇచ్చి పిల్లనిపెంచడం చౌకపద్ధతికూడాను. ఇతరమైనపాలకు, ఆహారాలకు

ధనం వ్యయంచేయవలసి వుంటుంది. ఎట్టి అదనపు ధనవ్యయంకాని లేకుండా సామాన్యపు పుష్టికరపు ఆహారంతిని తల్లి చనుపాలను ఉత్పత్తిచేసి శిశువుకు కావలసిన ఆహారపదార్థాలని అన్నిటినీ అమర్చిపెడుతుంది.

చనుపాలు తాగడంవల్ల పిల్లకుదవడలు గట్టిపడతాయి; దంతాలు సవ్యంగావస్తాయి. పాలబుడ్డినుండి పాలుపీల్చేటందుకు కావలసిన పరిశ్రమకంటె స్తనంనుండి పాలుపీల్చేటందుకు ఎక్కువ పరిశ్రమ కావాలి ఆకారణంగా స్తన్యంవల్ల పాలుతాగేపిల్లల దవడలు విశాలంగా వర్తులంగా తయారవుతాయి, దంతాలుగొద్దులు లేక సమంగాతయారవుతాయి.

పిల్లలు చనుపాలను తాగడంవల్ల మరిఒక లాభంకూడావుంది. ముక్కుతో గాలిని పీల్చగలిగితేతప్ప శిశువు స్తనాన్ని నోటితో చప్పరించి పాలుతాగలేదు. శిశువుల నాసారంధ్రాలికి విస్తారం పనికల్పించి అవి సమగ్రంగా అభివృద్ధిపొంది వాని పనిని అవితృప్తికరంగా నిర్వహించేటట్లు చేయడానికి స్తన్యపానం మంచి సాధన.

చనుపాలను శిశువు శీఘ్రంగా త్రాగగలదు. చనుపాలను ఇచ్చేవిధానం చాలా అనుకూలమైనదిన్నీ, యేకరీతిగావుండేదిన్నీ అయివుంది. అసాధారణ పరిస్థితులలో తప్ప చనుపాలు సర్వావస్థలయందును అమరుతూ వుంటాయి. తయారుచేయడం మొదలయిన కాలహరణాలతో నిమిత్తంలేకుండా తల్లి పిల్లవున్న ప్రతిచోటా చనుపాలు సంసిద్ధమై వుంటాయి. పడవలోకాని, రైలుమీదకాని కొండమీదకాని సమ ప్రదేశంలోకాని చనుపాలు సమకూడుతూ వుంటాయి. తల్లి, పిల్ల వుంటే సర్వకాల సర్వావస్థలయందు సర్వ ప్రదేశములందు చనుపాలు సందర్భపడతాయి.

చనుపాలు పిల్లలకుచేసే గుణం మరివకటి వుంది. చనుపాలు ఇవ్వడంలో తల్లి పిల్లని అడ్డాలలో పెట్టుకుని లాలిస్తుంది. తల్లి పిల్లల శరీరాలు అన్యోన్య స్పర్శలో వుంటూ వుంటాయి. మాతృదేవిలాలన, స్పర్శ శిశువుకు వెలకట్టరాని, అంతుపట్టరాని కులాసాలు కలిగిస్తుంది. కొందరు తల్లులు తమపిల్లల్ని లాలించడానికి వాళ్ళకి పాలు ఇవ్వడానికి భయపడతారు. ఈవిషయంలో తల్లులకు వుండే భయాన్నిగూర్చి. పిల్లలకు శాంతి నిద్రభంగం అవడాన్నిగూర్చి అనేకంగా చెప్పబడివుంది. పాలబుడ్డి చీకుమా, మెత్తటి తలగడాన్నే తల్లి అని కౌగలించుకుంటూ అవస్థపడవలసిన పిల్లస్థితికంటె దయనీయమైనస్థితి మరిఒకటిలేదు.

పిల్లకి తన చన్నుపాలను ఇచ్చి పెంచే తల్లికి అపూర్వమైన ఆనందం కలుగుతూ వుంటుంది. అనంతరకాలమందు ఈ ఆనందస్మృతి కూడా ఆమాతృదేవతలకు అపూర్వమైన ఉత్సాహాన్ని కలిగించేదిగా వుంటుంది.

చనుపాల పోషణపద్ధతి ఇన్ని విధాలుగా పిల్లకు లాభసాటి అయివుంటుంది. తల్లి విషయంలోకూడా ఈపద్ధతి చాలా ఉపయోగకరమైంది అయివుంది. తల్లికి ప్రసవానంతరం ఆరోగ్యం పూర్వస్థితిని పొందడానికి పిల్లకి పాలివ్వడం ఒకసాధనమని డాక్టర్లు నేడు చేయెత్తి చెపుతున్నారు. గర్భాశయం మెలితిరుగుట మొదలగు దోషాలికి గురిఅయితే స్తనాల్లోని పాలు ఎండిపోవడం సంభవించవచ్చునని డాక్టర్లు నేడు కనుగొనిఉన్నారు. పిల్లను రొమ్ముకు అడ్డంవేసుకోవడంవల్ల తల్లికి పాలుచేపువస్తాయి. ఆకారణంచేత పాలగ్రంధులు చురుకుగా పనిచేస్తాయి. అందువల్ల గర్భాశయ సంబంధమైన కండరాలు యధాస్థితికి రావడానికి అవకాశం యేర్పడు

తుంది. పిల్లకు పాలివ్వడంవల్ల తనపాల గ్రంథులను చురుకుగా పనిచేయించే తల్లి తన గర్భాశయానికి హెచ్చు రక్తప్రసారం కలగ జానికి వీలుకలిగించినది అవుతుంది. ఇందువల్ల పాలతల్లి గర్భాశయం సంకోచాన్ని పొంది యథాస్థితికి వస్తుంది. గర్భధారణకు పూర్వం ఏస్థితిలో గర్భాశయంవున్నదో ఆ స్థితికి తిరిగి అదివస్తుంది. పిల్లకు పాలివ్వని తల్లికి పాలగ్రంథులు శోషరితనాన్ని పొందడం కారణంగా గర్భాశయం యథాస్థితిని పొందజానికి చాలకాలం పడుతుంది. ఒకప్పుడు అట్టి తల్లికి గర్భాశయం చాలాకాలానికి కూడా యథాస్థితికి రాకపోవచ్చును.

చనుపాలు శిశువుకు చాలమంచివని చెప్పజానికి చనుపాలు తాగిన శిశువులలో మరణాలు చాల తక్కువగావుండడం, వాళ్ళ ఆరోగ్యం మిక్కిలి లెస్సగావుండడం, వాళ్ళ పోషణ సమగ్రం అయివుండడం నిదర్శనాలు. చనుపాలు తాగిన శిశువులలోకంటె పోతపాలతో పెంపకమయ్యే శిశువులలో మరణాలసంఖ్య నాలుగు, ఐదురెట్లు ఎక్కువగా వుండడం లెక్కలు తెలుపుతున్నాయి.

పోతపాల పిల్లలకు పిట్టరూపురావడం తఱుచు. చనుపాలుతాగే పిల్లలు పుష్టిగా, బొద్దుగా వుంటారు. వారి పలువరుస అందంగా వుండవలసినంత దూరంగా వుంటుంది.

చనుపాలుతాగడం పిల్లల ఆరోగ్యవిషయంలో భీమాచేయడమే. పిల్లకి పాలివ్వడం జనులు సాధారణంగా అనుకునేటట్లు తల్లి ఆరోగ్యాన్ని పాడుచేయదు. పాడుచేయకపోవడమేకాకుండా ఆమె ఆరోగ్యాన్ని మరింత పెంపొందిస్తుంది; ఆమెకు నూతన చైతన్యాన్ని, కొత్త వుత్సాహాన్ని కలిగిస్తుంది. పిల్లకి పాలివ్వడంవల్ల తల్లికి బాగా ఆకలి అవుతుంది.

ఇన్ని రీతులచేత పిల్లకి పాలివ్వడం ఉభయత్ర అనగా తల్లికి పిల్లకి కూడ లాభప్రదమైంది అవుతూవుంది.



# 'సరిహద్దుగాంధీ'

(జీవితాంశములు)

ఇతని పూర్తిపేరు ఖాన్ అబ్దుల్ గాఫర్ ఖాన్ తండ్రిపేరు ఖాన్ సాహెబ్ బెహరమ్‌ఖాన్. ఇతని అన్న పశ్చిమదేశముల వైద్యవిద్యలో పట్టభద్రుడై నేటి సరిహద్దు సభలో కాంగ్రెస్ పార్టీనాయకుడై పేరు ప్రతిష్ఠలు గాంచుచుండెను. ఇతడు 1890-వ సంవత్సరము పెషావర్ జిల్లాలోని ఉత్మాంజయ గ్రామమున జన్మించెను. ఈతడు చిన్నతనములో పెషావర్ లోని మిషనరీస్కూలులో చదువునారంభించెను. ఇతడు 'మెట్రిక్యులేషన్' పరీక్షకూడ జయము గాంచలేకపోయెను ఈతడుకూడ తనయన్నవలెనే పాశ్చాత్యదేశములకు విద్యవిషయమై వెళ్లెడువాడు కాని కుటుంబచిక్కులు మూలమున నట్లు చేయలేకపోయెను చిన్నవాటనుండియు కులసేవయు దేశసేవయు చేయుటయందు అభిరుచి కలిగియుండెను చాల కాలము యితడు యుద్ధభటునిగా జేరవలయునని కుతూహలపడెడువాడు కాని తనమిత్రుడు ఒకడు సైన్యాధికారి యుద్యోగములో యుండగా అతని కంటె తక్కువ యధికారిని నిందించుట కన్నులార గాంచెను. ఈనింద సహింపజాలక యీయుద్దేశమును రద్దుచేసుకొని సైనికావృత్తికి తిలోదక మొసగెను. ఇతనికి ముగ్గురు కుమారులున్ను నొక కుమార్తెయు గలరు. ఇతడు 10 సంవత్సరముల క్రితమే భార్యావిహీనుడయ్యెను.

మొదటినుండియు ఇతడు స్వతంత్రేఛ్ఛ గలవాడు. దేశసేవయన్న కడుంగడు ప్రియము. 'జమీందార్' 'అల్ హిలాల్' అనెడు రెండు హిందూస్తానీ వార పత్రికలవల్ల రాజకీయసమస్యలు తెలుసుకొనగలిగెను జాతీయవిద్యయందభిరుచి 1911 లోనే నితనికి కలిగెను. ఇతడు 'ఎవులట్' చట్టములను రద్దుపరచు ఉద్యమములో పాల్గొనెను. ఈకారణముచే నితనిని గవర్నమెంటువారు ఖైదుచేసి దరిమిలాను వదలివేసిరి. ఇదియే ఇతని మొదటి కారాగృహవాసము.

ఇతడు 1920 లో నాగపూర్ లో జరిగిన జాతీయ మహాసభకువచ్చి 'కిలాఫత్' ఉద్యమములో పాల్గొనెను. పిమ్మట తనగ్రామమునకేగి జాతీయ పాఠశాల నొకదానిని స్వంతముగా స్థాపించెను. తనదేశమంతటను అటువంటి పాఠశాలలు స్థాపింప ప్రయత్నించగా గవర్నమెంటువారు ఆకార్యక్రమమున కడ్డువచ్చిరి. ఈ మిషచేతనే 1921 లో 'ఫ్రాంటియర్ క్రైమ్సు రెగ్యులేషన్' చట్టముక్రింద నితని తిరుగ ఖైదుచేసిరి. ఇక్కాలమందు చెప్పరాని ఇక్కట్లు ఇందు సంభవించెను. అప్పుడే నడుము నొప్పి మొదలగు దీర్ఘవ్యాధు లితనిని బాధించినవి. ఈ కారాగృహవాసమునందే భగవత్‌గీత చదువుటితనికి లభించెను. ఈసమయముననే 'సరిహద్దుగాంధీ' యని నామకరణమునకు కారణ మయ్యెను నేలయన మహాత్ముడు ఏకార్యము చేసినను ఆతడనుసరించెడువాడు. మహాత్ముని జీవితమును చక్కగా పరిశీలించి దానివిధమున ననుసరించెడివాడు. వారమున కొకసారి ఉపవాసము చేసెడివాడు. మహాత్మునివలెనే ఉపవాసము లుండెడివాడు ఇట్టే వారమున కొకసారి మౌనవ్రతము పూనెను.

ఈ సందర్భములచే ఈతనికి సరిహద్దుగాంధీ యను పేరువచ్చెను.

1924 లో జైలునుండి విడుదలైన పిదప సంఘ సంస్కారమునకు పూనుకొనెను ఇతడు 1921 లో స్థాపించిన జాతీయ పాఠశాల కొంతమంది దేశ సేవకులను తయారుచేసెను వారికి పేరు 'భగవంతుని సేవకులు.'

తిరిగి ఉప్పుసత్యాగ్రహ సత్యాగ్రహసమయమున కారాగారమున తిరిగి బంధింపబడెను. తదుపరి విడుదలై రాజద్రోహపు నేరముక్రింద బంధితుడయ్యెను.

కొంత కాలముక్రిందటనే జైలునుండి విముక్తుడై తన దేశమునకు పోవుటకు గవర్నమెంటువారిచే నిషేధింపబడి ప్రస్తుతము మహాత్మునికడ వార్ధాశ్రమవాసియైయుండెను. జాతీయమహాసభకు అధ్యక్షపదవి నిరాకరించెను ఇతడు మహాత్ముని యడుగుజాడల ననుసరించెడివాడు. నిరాడంబరజీవి కాంగ్రెస్ చరిత్రయంతయూ వెతికినను యిటువంటి దేశసేవాతత్పరుడు స్వాతంత్ర్యాభిలాషి వేరొకపురుషుని కానలేము.

—బి. కేశవరావు, బి. ఏ.

## పోటీపరీక్షలు

శ్రీరవీంద్ర సారస్వత సమాజ యాజమాన్యమున్న యీక్రింది పోటీపరీక్షలు 1938-వ సం॥ జనవరి నెలలో జరుగుతవి—పరీక్షల తేదీలు ముందు తెల్పబడును—

I 25 సంవత్సరాలు దాటని స్త్రీపురుషులకు:—

[శ్రీతటవర్తి వెంకటరత్నంగారి స్మారకచిహ్నంగా.]

శ్రీభగవద్గీత 5, 6, 7 అధ్యాయాలు.

బహుమతులు రూపాయలు 25—0—0, 15—0—0.

II ప్రత్యేకం స్త్రీలకుమాత్రము:—

[శ్రీ చిల్లాయమ్మ స్మారకచిహ్న సారస్వత పోటీ.]

(1) భారతం-విరాటపర్వం. చతుర్థాశ్వాసం (కవి: తిక్కన్న.)

(2) పద్మావతీ చరణచారణచక్రవర్తి (కవి: తల్లావఝ్ఝుల శివరామశాస్త్రి గారు.)

బహుమతులు రూపాయలు 20—0—0, 10—0—0.

ఈ రెండుపరీక్షలూ పశ్చిమగోదావరిజిల్లా వాసులకుమాత్రమే. ఏలూరు, కొవ్వూరు, తణుకు, నర్సాపురం, భీమవరం, సెంటర్లలో ఒకేరోజున జరుపబడును. దరఖాస్తు రుసుంలేదు. ఈ సంవత్సరం డిసెంబరు 10 తేదీలోగా, మా కార్యాలయానికి దరఖాస్తులు, చిరునామా, వయస్సు, వివరాలు, ఏపరీక్షకు నిలచేదీ తెల్పాలి. స్త్రీలు రెండుపరీక్షలకూ దరఖాస్తు చేయవచ్చును.

వివరాలకు:

అత్తిలి సూర్యనారాయణమూర్తి,<br>
కార్యదర్శి.<br>
శ్రీరవీంద్రసారస్వతసమాజం.

భీమవరం.




## జావాదేశపు బాలికలు

జావాదేశం హిందూమహాసముద్రంలో వున్న ద్వీపాల్లో ఒకటి. అది భూమధ్య రేఖకు మిక్కిలి సమీపంలో వుండడంచేత అక్కడ సంవత్సరంపొడుగునా వేసవిగానే వుంటుంది. కాబట్టే అక్కడివారికి విస్తారం దుస్తులు అవసరంలేదు. ఎలప్రాయంలోవున్న బాలికలు కూడా బజారులవెంట పైన ఎట్టిదుస్తులుకాని లేకుండా వెళుతూవుంటారు. వారిని చూడ్డానికి మనదేశస్థులకు వింతగా వుండవచ్చును కాని అచ్చటివారికి ఇది ఒకవింతఅని అనిపించుకోనే అనిపించుకోదు.

బాలికలు బాగా పెద్దవాళ్లు అయాక తొడుక్కోటానికి మన జాకెట్టువంటి వుడుపును వుపయోగిస్తారు. అవుడుపును ఆదేశంలో 'శరాంగ్' అంటారు. శరాంగ్‌లు పెక్కు రంగులతో ఒప్పుతూవుంటాయి.

వ్రేలికి వుంగరాలు, చెవికి పోగులు, చేతికి మురుగులు ధరిస్తారు. వారిశిరోజములు చాలా అందంగా వుంటాయి. స్వయంగా తయారుచేసుకున్న కొబ్బరినూనె బాగా రాచుకొని జావాదేశపు బాలికలు తమ శిరోజాల్ని జాగ్రత్తగా పెంచుకుంటారు.

పదియేళ్లు పైబడేవరకు ఆ బాలికలు నియామకంగా తలవెంట్రుకల్ని ముడివేసుకోరు. పెద్దవాళ్లు అయినతరువాత వెనుక జారుముడి వేసుకుంటారు.

వారు కాళ్ళకు ఎట్టిజోళ్లుకాని ధరింపరు. ఇంటకాని బయటకాని పనిచేయునపుడు వారు వట్టికాళ్ళతోనే వుంటారు.

సామాన్యసంసారమునకు చెందిన జావాదేశపు బాలికయొక్క ఆహారములో ప్రధానమైనది వరిఅన్నమే. జావాదేశీయులు బొగ్గులమీదకాని కట్టెలమీదకాని వండుకుంటారు.

మిక్కిలి పేదవారు సాధారణంగా వంట చేసుకోరు. ఆదేశంలో వండినఅన్నం వీధుల్లో తిరిగి వర్తకులు అమ్ముతారు. ఆ అన్నం చాలా చవకగా దొరుకుతుంది. పేదకుటుంబాలు సాధారణంగా వీధుల్లో ఓప్రక్కని కూర్చుని అన్నాన్ని తింటారు. వరిఅన్నమే కాకుండా వారు చేపలకూరలు, కాయకూరలు తింటారు. వారు సాధారణంగా మంచినీరే తాగుతారు. నిమ్మరబతు వీధుల్లో విరివిగా అమ్మబడుతుంది. దానిని ఆదేశస్థులు అతి అపాయ్యంగా తాగుతారు.

వారి యిళ్ళకట్టడం అంతా పూర్వకాలపు పద్ధతిలోవుంటుంది. వెదురు, మన్ను, కొయ్య

వీటితో నిర్మింపబడిన తాటాకు ఇళ్లల్లోగాని, పెంకుటి యిళ్లల్లోగాని వారు నివశిస్తారు. ఇంటిలో వారికి సామాను విస్తారంగావుండదు. వుండేదల్లా వెదురుకర్రలతో కట్టిన సోఫా ఒకటి. దానిమీద కొబ్బరిచాప పరుచుకొని వారు రాత్రిపూట నిద్రపోతారు.

జావా దేశస్థులు చాలా శుచిగావుంటారు. జావాబాలికలు సాధారణంగా దినానికి రెండు మూడు సారులు స్నానంచేస్తారు. పాశ్చాత్య దేశంలోమాదిరిగా వారికి స్నానపుగదులు ప్రత్యేకించివుండవు. దగ్గరలోవుండే నదిలోనో, ఏటికాలవలోనో వారు స్నానంచేస్తారు. వారు బట్టలుకూడా అక్కడే ఉతుక్కుంటారు. జావా దేశపు రాజధానీనగరమగు బటేవియాపట్టణంమధ్యగా ప్రవహించే కాలువ రెండుప్రక్కలూ ఉదయంమొదలు అస్తమానంవరకు బట్టలువుతికే వారితోనూ, స్నానాలుచేసే వారితోను నిండారివుంటాయి.

జావా దేశపు బాలికలకు బడికివెళ్ళడమంటే సరదా. ఇంటిపనులు చేయడంకంటె బడికి వెళ్ళడం ఎక్కువ నాగరికమని జావాబాలికల తలంపు. కాని బడికి జీతం కట్టవలసివుంది. పైగా జావాకుటుంబాలలో సంతానబాహుళ్యం వుంటుంది. ఈకారణాలచేత విద్యా విషయంలో కుటుంబయజమాని ఆడపిల్లలకంటె మగపిల్లలకు హెచ్చు సౌకర్యాలు కలిగిస్తాడు.

బాలబాలికలకు కలిపి ఒకేపాఠశాలలో చదువు చెపుతారు. కొన్నికొన్ని విషయాల్లో బాలురకంటె బాలికలే హెచ్చు తెలివిని కనబరుస్తారు. నడవడిలో, మాట పొందికలో బాలికలదే పై చేయి. విద్యావిషయంలో అభివృద్ధి చూపించడానికి బాలురకంటె బాలికలు విశేషమైన ఆశక్తిని చూపుతారు. కాని లెక్కల విషయంలో బాలురకంటె బాలికలు చాలా వెనుబాటుగా వుంటారు.

జావా దేశపు బాలికలకు సిగ్గుమెండు. స్కూలులో కాని స్కూలువదలినతరువాత కాని బాలబాలికలు ఒండొరులతో మాట్లాడుకోకూడదు, ఆడుకోకూడదు, వీధుల్లో ఒకరిసరసను ఒకరు నడవకూడదు.

పలురంగుల జాకెట్లతో, ఇంటిపనులు చురుకుగా చేయుటచే గడిదేరిన కాయ సౌభాగ్యముతో, మధురమందహాసమున తేలియాడు సుందరవదనములతో అచటి స్త్రీలు, బాలికలు చూడతగివుంటారు.



క. ఇది సాధ్య మగు నసాధ్యం, బిది యనఁగా నేల కార్య మీడితధిషణా
స్పదులై తగ నొనరించిన, నది సిద్ధిం బొందు నిశ్చలారంభునకున్.

క. అమరత్వం బమరేశ, త్వ మమరపూజత్వ మనుపదంబులు వరుస
న్నమధికతమవిహితోద్యో, గమునన యవి తమ్ముఁ బొందఁ గాంతురు మనుజుల్.

ఆ. అరుగకుండె నేని గరుడఁ డైనను నొక్క, యడుగు నరుగ లేఁడు కడఁగి చీమ
యైన నరుగఁ దొడఁగె నేని యనేకస, హస్రయోజనమ్ము లరుగుచుండు.

క. భువి యెక్కడ దివి యెక్కడ, ధ్రువుఁ డీభువినుండి కాదె ధ్రువ మగుపదముం
దివిఁ బడసెం గావున న, ద్వ్యవసాయికిఁ బడయరానియదియును గలదే.

—మార్కండేయపురాణము.

## తెలుగుటాకీ తెచ్చే డబ్బు

తెలుగుటాకీలు ఇప్పుడిప్పుడు చాలా తయారౌతున్నాయి. ఇదివరకు, ఇతర రాష్ట్రాలలో తెలుగుటాకీ తయారుకావడానికి ఎంతఖర్చౌతుందో లెక్క వేశాం. అంతకన్న తక్కువఖర్చుతో తెలుగుటాకీ తీస్తేకాని ప్రొడ్యూసర్లు నష్టపోతారాలేదా అని ఆలోచించాలి.

సావిత్రీ, లవకుశ, మిసమ్మా రిలీజైతే ఏ ఏ సెంటర్లు ఏపాటిడబ్బు గణిస్తాయో, సుళువుగా ఇప్పుడు లెక్కకట్టవచ్చు, ఇప్పటికి జరిగిన జమలనిబట్టి.

తెలుగుటాకీలకి పెద్దసెంటర్లు చాలాకొద్ది.

మద్రాసు, విజయనగరం, బెజవాడ, బెంగుళూరు, వీటిలో ముఖ్యం.

తరువాత చెప్పుకోదగ్గవి— కాకినాడ, గుంటూరు, తెనాలి, విశాఖపట్టణం, సికింద్రాబాదు, ఏలూరు.

పైని పేర్కొబడిన స్థలాలలో, ఓమాదిరి బాగా తయారైన తెలుగుచిత్రం ఎంతెంత డబ్బు తెస్తుందో సుళువుగా తెలుస్తూంది. ఇక్కడ మేంచెప్పిన అంకలు అంచనాలుకావు. ఇంతవరకు ఆయాప్రదేశాలలో వేయబడిన తెలుగుటాకీలరాబడినిబట్టి, రమారమిగా సూచిస్తున్నాం.

మద్రాసులో ఎనిమిదివారాలకిపైగా చిత్రంనడిచిందంటే కొంత బాగున్నదన్నమాటే. అలాగే, విజయనగరం, బెజవాడ, బెంగుళూర్లలో నడవాలి.

| | |
|---|---|
| మదరాసు— | 25,000 |
| విజయనగరం— | 13,000 |
| బెంగుళూరు— | 12,000 |
| బెజవాడ— | 15,000 |
| | 65,000 |

తక్కిన ఆరుసెంటర్లు, ఓమోస్తరైనవి. అక్కడ ఆరు వేలవరకు వస్తుంది, మొత్తం ఆరుసెంటర్లకీ 35,000 రావచ్చు.

అంటే, ముఖ్యసెంటర్లలో, ఉత్తమ చిత్రానికి, లక్షరూపాయలు కలెక్షను.

అందులో 50,000 మాత్రం ప్రొడ్యూసరువంతుగా భావించవచ్చును.

ఇంక, రమారమి రెండేసివేలు తెచ్చే సెంటర్లు పట్టుని పదివున్నాయి. తక్కినస్థలాల్లో, థియేటర్లుగల ప్రదేశాలు, సుమారు అయిదువందలు తెస్తాయి; అవి మరోపదిమాత్రం వున్నాయి. తక్కినవి లెక్కలేదు. లెక్కరాదు.

మొత్తంమీద తేలేదేమిటంటే, మంచి తెలుగుటాకీకి 1,30,000 మించకుండా డబ్బురావడానికి అవకాశాలువున్నయి. అందులో 65,000 ప్రొడ్యూసరికి చెందుతాయి.

అంచేత 65,000 మించి ఖర్చుచేసి తీసిన తెలుగుచిత్రం నష్టపరుస్తుందికాని లాభం చూపెట్టదు.

అరవైవేలు మించనిచిత్రం నష్టపర్చదు.

పైవిషయాలు జాగ్రత్తగా ఆలోచిస్తే, ఈకాలంలో తెలుగుటాకీ తీయడం మానుకోవడమే మంచిదనిపిస్తుంది.

ఎందుకనిపిస్తుంది ?

ఇతరరాష్ట్రాలలోపడి నానాఇబ్బందులుపొంది మనం చిత్రాలు తయారుచేస్తూవుంటే మనపనిఇంతే.

—సరస్వతి.

* * *

## నగ్ననృత్యాలు

నగ్ననృత్యాలు అనేపేరు వినేసరికే భయపడిపోవడం చూస్తే ఆశ్చర్యమేస్తుంది. నగ్ననృత్యాలు అశ్లీలాలనీ, అవినీతికరాలనీ అనుకోడం చాలా పొరపాటు. నిజానికి, కళావంతములైనవి నగ్ననృత్యాలే; నిసర్గమైన ఆనందానికి దూరమై—నగ్నతను కేవలం అశ్లీలంగా భావిస్తున్న మనమూ దయనీయులము?

కళ అంటేః ఏది కళ అనబడుతుంది? మానవ

ప్రకృతిలో ఉత్తేజితానందాన్ని కలిగించేది కళ. నిసర్గమైన ప్రతిభంగిమవిశేషము కళ అనబడుతుంది.

కళ అనేది ఇది అనీ, ఇలా వుండాలి అనీ నిబంధించే శక్తి ఏకళాశాస్త్రానికీ లేదు. కళాశాస్త్రాల గౌరవం వ్యాకరణాలతోపాటిది. భాషతర్వాత వ్యాకరణాలెలా పుట్టినవో కళతర్వాత కళగ్రంధాలలా పుట్టినవి. కళాస్వరూపాన్ని తెలిసినంతలో వివరించగలంతలో నిర్వచించారు. ఆభంగిమాల లక్షణాలూ, నిర్వచనాలతో కళాశాస్త్రాలయినవి. సహజంగా కలిగే ప్రతి ఆంగికచలనమూ ఒక కళాభంగిమం అవుతుంది. ఆయా భంగిమాలను ప్రయత్నంతో ప్రదర్శించడమే కళ. ఈ ప్రయత్నంలోనే సర్కసతత్వం వుంది. చిత్రరచనకూ, కవిత్వానికీ, సంగీతానికి ఎలా శిక్షణ అవసరమో, అలానే నృత్తనాట్యాలకుకూడా అవసరం. ఇవన్ని సహజంగా కలిగేవే అయినా, మానవజీవితంలోని పూర్వ అనుభవాలను బట్టి వాటిని అభ్యసించి, త్వరలో ఉత్కృష్టత పొందడానికి అవకాశం వుంటుంది. కాబట్టి శిక్షణ అవసరం.

మానవజీవితంలో ప్రాథమికదశలోనూ, ఉన్నతకళాదశలోనూ నగ్నత ఆచరణీయంగా ఆదరింపబడుతుంది.

సహజమైన ఆంగికభంగిమాలను ప్రదర్శించవలెనన్నా, దర్శించవలెనన్నా నగ్ననృత్యాలు అవసరం. ఈ విపరీతమైన నాగరికతాభివృద్ధి పరిణామంగా నగ్నత సభ్యంగా, అవసరంగా, ఒకమతంగా పరిగణింపబడుతున్న ఈరోజుల్లోకూడా- నగ్ననృత్యాలు, అసభ్యాలు, అశ్లీలాలు అనే వాదం చూస్తే హాస్యాస్పదంగా కనిపిస్తుంది.

నగ్నస్వరూపాలను చూస్తేనే అవినీతి భావాలు కలిగేట్టయితే ఆవ్యక్తికి సభ్యతలేదనుకోవాలి; కొన్ని దేశాల్లో మరుగుపరచబడే శరీరభాగాలు మరికొన్నిదేశాల్లో మరుగు పరచబడడంలేదు. ఆమరుగు పరచబడని దేశాల్లో వారికి ఆయాభాగాలు వికారాన్ని కలిగించవు; కాని మరుగుపరచబడే దేశాలవారికి వికారకారణాలే అవుతవి. అది ఆయాదేశాల సభ్యతనుబట్టి వుంటుంది. ఇది సభ్యమూ, అసభ్యమూ అనేనిర్ణయం ఆయాప్రాంతాల అభిరుచులనంటి వుంటుంది. నగ్నత అంటేనే మనం అదరిపోతాం కనుక మనలో సహజమైన ఉద్రేకం చచ్చి, కృత్రిమమైన-వృత్తిరూపకమైన కామోద్రేకం సాంఘికంగా ఏర్పడివుంది కనుక మన చూపులకు నగ్ననృత్యాలు అశ్లీలాలుగానే, అవినీతికరాలుగానే దూపట్టవచ్చు.

అంతమాత్రాన అవి ఏమాత్రం అసభ్యాలుకావనీ, అలాంటి నృత్యాలు ప్రదర్శించడంగానీ, సందర్శించడంగానీ మానవనాగరికతలోని నిజమైన ఉచ్ఛదశ అనీ తలుస్తాను. (ప్రజాబంధు.)

—ప్రయాగ కోదండరామశాస్త్రి.

* * *

## "తేనెటీగలు: తేనెపరిశ్రమ"

తేనెటీగలుకు మేత నానావిధముల పువ్వులు, వేపపూత, చింతపూత పత్తిచెట్లపూత, జొన్నపయిరుపూత,మామిడిచెట్లపూత యింకొ నానావిధములపూత. ఈపువ్వులలోనుండు అమృతమును తేనెటీగలు త్రాగి దానిని వాటి తెట్లలోనుండు రంధ్రములలో గ్రక్కును. ఆరంధ్రములునిండిన తర్వాత దానిని మైనముతో భద్రముగా మూసివేయును. ఇట్లుఆయిన తెట్టె పూర్తిగా నిండినతర్వాత ఆతెట్టెను తీసి దానిలో వుండేతేనెను తీసుకొనవచ్చును. తేనెతీయుటకు వక యంత్రము గలదు. యీ యంత్రమును వుపయోగించినచో, తేనెను మాత్రం తీసుకొనవచ్చును. తెట్టెలు చెడిపోకుండావుండును. యీ తెట్టెలను మరల పెట్టెలోపెట్టిన యెడల యీగలు వాటిలో మరల తేనెను చేర్చును. ఇట్లు తీయు తేనె అప్పటమయినతేనె. మందులకు ఆహారమునకున్ను వుపయోగించవచ్చును. యిట్టి తేనె బజారులో దొరకదు. బజారులో అమ్మేతేనె కొండలలో, చెట్లలో పెట్టే తేనెతెట్లవల్ల వచ్చుతేనె. అట్టి తేనెతెట్టెలు, తేనెకు ప్రత్యేకముగను, గుడ్లకు ప్రత్యేకముగను తెట్లువుండవు. వక తెట్టెలోనె పై

భాగమువందు తేనెయు, క్రిందిభాగమువందు గుడ్లు వాటి యాహారమునుయుండును. యిట్టి తెట్టెల క్రింద పొగ వేసి యీగలను తరిమివేసి తెట్టెనంతయు చేతితో పిండి తేనెను తీయుదురు. ఇందువలన తేనెయే గాక తెనెగుడ్ల రసమున్ను అందులో కలిసియుండును. ఇదియే మనకు అంగళ్లలో దొరుకు తేనె. సాధారణముగా పెల్లపుపొగులో కొద్దిగా తేనెపోసి మంచి తేనెయని సాధారణముగా బజారులో అమ్ముదురు. సాధారణముగ వక పెట్టె పెట్టుకున్న యెడల సంవత్సరమునకు 10 పౌనుల తేనె వచ్చును. 1 పౌను 1-0-0 లేక 1-4-0 వెలకు అమ్మును. వక పెట్టెవలన సంవత్సరముకు 10, 12½ రూపాయిలు ఆదాయమురాగలదు. కోయంబత్తూరు కాలేజలో 11 పెట్టెలు పెట్టి అందువల్ల వక సంవత్సరమునకు 223 రూపాయిలు లాభము వచ్చినదనియు, యిందుకుగాను ఖర్చులు 30-0-0 లు పోను నికరం 193 వచ్చెననియు అందువల్ల పెట్టె 1-కి 17 రూపాయలు పైగా లాభము వచ్చెనని తెలిపియున్నారు. సాధారణముగ ప్రతి రయితుయున్న 4-5 పెట్టెలకు తక్కువ కాకుండా పెట్టుకొనవచ్చును. ఇందువలన సాధారణముగా 60 నుండి 80 రూపాయలు ప్రతి సంవత్సరమున్ను లాభము పొందవచ్చును. యీ సంపాదన అల్పమని తలంచకూడదు. రెట్టి కష్టములేకనె యీ లాభము పొందుట యుచితము కాదా ? యిట్టి తేనెపెట్టెలను తోపులు వుండు గ్రామములలోను, జొన్న, ప్రత్తి పయిరు జేయు గ్రామములలోను, చింత చెట్లు మామిడి చెట్లు విశేషముగావుండు గ్రామములలోను రయితులు వుంచుకొనవచ్చును. (సుబోధిని.)

— కే. వి. రాఘవాచార్యులు, బి.ఏ., బి.ఎల్.

* * *

### వి వా హం : కా మం

వివాహం అంటే కట్టుదిట్టాలతో కూడిన ఏకపత్నీత్వమన్నమాట. కామం ఎప్పుడూ బహుపత్నీత్వాన్ని వాంఛిస్తూంటుంది.

వివాహం చాలా అవసరమైనసంస్థ. దానివల్ల చాలా ప్రయోజనాలుకూడా ఉన్నాయి. బహు పత్నీత్వవాంఛగాని, బహుపతీత్వవాంఛగాని మనిషిలో నశించేవరకూ వివాహం చేసుకోకూడదు.

యువతీ, యువకులకు నాసలహా ఏమిటంటే,- సాధ్యమైనంత అనుభవం గడించవలసిందని. వివాహమయ్యేలోపల ఎంత అనుభవంసంపాదిస్తే, వివాహానంతరం అంత సౌఖ్యం అనుభవించవచ్చు. వైవాహికజీవితం సౌఖ్యప్రదంగా ఉండవలెనంటే, భార్యకూడా దానికి అవసరమైన అనుభవం చేకూర్చుకోవాలి! అంటే కేవలం వంటచేయడం, ఇల్లు శుభ్రంగా ఉంచడమే కాదు !

యువకులకు నా సలహా ఏమంటే—మీ భార్యలను మీరు నిజంగా ప్రేమిస్తున్నారన్న విషయం మీ భార్యలే నమ్మేట్టుగా చేసుకోవాలి. ఈవిషయం మీరెప్పుడూ మరిచిపోకూడదు.

మీరు ఇలా చేయకపోయినారో, భార్యలు తమ సహజ స్త్రీవాంఛలను నెరవేర్చుకోవలెననే ఆశకు వశులై పోతారు.

పురుషుడికంటె స్త్రీకి వ్యక్తిత్వం జాస్తి.

అందువల్లనే పురుషుడుకంటే కూడా స్త్రీకి సంభోగేచ్ఛ ఎక్కువ.

సౌందర్యవతి అయిన స్త్రీకి తనసౌందర్యాన్ని ఇతరులు ఆమోదించవలెననే ఆశ ఉంటుంది. పురుషుణ్ణి ఆకర్షించేది ఒక్క సౌందర్యమే కాదని సాధారణ స్త్రీ తెలుసుకుంటుంది.

పరిపక్వవయస్సువచ్చినదాకా వివాహం చేసుకోకూడదు. అంటే స్త్రీకి ముప్పైఏండ్లు పురుషుడికి ముప్పైఐదుఏండ్లు ఉండాలి. వివాహం కేవలం మానసికస్థితికి సంబంధించిన విషయం.

భార్యాభర్తలు ఇద్దరూ ఒకరితో ఒకరు ఎంతో నిజాయితీగా ప్రవర్తించాలి. ఇద్దరు ఒకరితో ఒకరు మనసువిప్పి ప్రవర్తించాలి. (బ్లమ్) (ప్రజామిత్ర.)

# ఇన్స్యూరెన్సు విషయములు

## స్త్రీల జీవితముల భీమా

ఇండియన్ ఇన్స్యూరెన్సు కంపెనీలు స్త్రీల జీవితములను భీమాచేయుటకు ఒకవిధమైన అనిష్టమును, అసమ్మతిని కనబఱచును. స్త్రీల జీవితములను భీమాకు అంగీకరించుట మిక్కిలి ప్రమాదకరమైన విషయముగా చూడబడుచున్నది. తప్పని సరిగా స్త్రీలజీవితములను భీమాచేయవలసివచ్చుచో ఆ సమయమున మితముతప్పిన మెలుకువ చూపబడుచున్నది. ఏమాత్రము సడలుబాటు కనిపించినను కొంపలు మునిగిపోవునట్లు భావింపబడుచున్నది.

ప్రస్తుతకాలమున ప్రపంచమున అన్ని ప్రదేశములందును అన్నివృత్తులలోను స్త్రీలకు పురుషులతో సమానప్రతిపత్తి ఒసగూడియున్నది. అయినను ఇన్స్యూరెన్సు విషయమున స్త్రీలజీవితములను పురుషుల జీవితములకంటె వెలతక్కువ అయినవిగా చూచుచు స్త్రీపురుషుల విషయమున ఇంతటి విభేదమును చూపుట ఆశ్చర్యకరముగా నున్నది. ఈ ఆధునికయుగమున స్త్రీలు గుఱియగు ప్రమాదములు పురుషులు గుఱియగు ప్రమాదముల వంటివే. అయినను ఇన్స్యూరెన్సు కంపెనీల నియమావళిలో స్త్రీలజీవితముల భీమావిషయమున ప్రత్యేకమును సంకుచితమును అగు నిబంధనలు పెక్కుటిల్లి యుండుచున్నవి. ఒక్కొక్కప్పుడు ఈ నియమావళిని పరికించుచో స్త్రీల జీవితముల భీమాపై నిషేధముంచుటకే ఇట్టి నియమావళి ఏర్పఱుప బడినదా అని అనిపించుచుండును.

ఆరోగ్యవిషయమున వెనుకబడియున్న వ్యక్తుల జీవితములను భీమాచేయుచో వారి పోలసీమీద హెచ్చు ప్రీమియము వసూలు చేయబడుచున్నది. ఆరోగ్యమే భీమావిషయమున లక్షణముకాని స్త్రీపురుష విభేదము ఎంతమాత్రమును కాదు, ఒకేవిధమైన ఆరోగ్యముగల స్త్రీపురుషుల జీవితములను భీమా చేయుచో ప్రస్తుతము పురుషుల జీవితముల మీదకంటె స్త్రీలజీవితములమీద హెచ్చు ప్రీమియములను పుచ్చుకొనుచున్నారు. ఇది కేవలము అన్యాయము. ఈహెచ్చు ప్రీమియము వసూలువలన పురుషుల ఆరోగ్యముకంటె స్త్రీల ఆరోగ్యము తగ్గుస్థితిలో ఉన్నదని తలంపవలయునా? ఏమాత్రము వివేకము ఉన్నవారైనను ఇట్లుతలంచుటకు అవకాశము లేదని చేయెత్తి చెప్పగలరు. మృత్యుదేవతకు స్త్రీపురుష విభేదములేదు. దాని కరాళవదనమునకు స్త్రీపురుషులు సమానముగనే గుఱియగుదురు. అట్టిచో స్త్రీలజీవితములపై హెచ్చు ప్రీమియమును వసూలుచేయుట ఏ విధముగను అర్థములేనిదగుచున్నది; ఏరీతిగను సబబులేనిదగుచున్నది.

మఱియు స్త్రీలజీవితముల విషయమున ఇంకొక విషమముకలదు. భీమాచేయబడు

టకు స్త్రీజీవితము అంగీకరింపబడి ఆ స్త్రీ ఇన్సూరెన్సుకంపెనీ వైద్యుని పరీక్షకు ఆగి అదనపు ప్రీమియమును కట్టుటకు సమ్మతించినను ఆమె పోలసీపొందుటకు ఇంకను నిరోధము ఉండుచున్నది. ఆపోలసీని కొన్ని వత్సరములవరకు అనామతులోనే ఉంచుదురు. ఇక ఇన్సూరుచేసి ఏమిలాభము? ఇట్టి స్థితిలో ఇన్సూరుచేసిన స్త్రీకి ఏమి ఉత్సాహముగ నుండును? సంశయభావమును తొలగించుటయే భీమావిధానము యొక్క మూలసూత్రమై యుండగా ఇచ్చట అసంశయభావము తొలగుటయే లేదు. ఆరోగ్యవతియగు స్త్రీ జీవితము సమర్థుడగు వైద్యుని విశేషపరీక్షకు ఆగినది పట్టాపొందకయే కొన్నినాళ్లు అనామతులో అటమటించుచున్నది.

ఎట్లో నిరోధములనన్నిటిని దాటి పట్టా పొందుసరికి స్త్రీకి ఎనలేని నిరుత్సాహము కలుగుచున్నది. ఆమె మెడకు కంపెనీవారు నెమ్మదిగా మఱియొక ఉరిత్రాడు తగుల్చుదురు. ఈఉరిత్రాడునుండి ఆమె తప్పించుకొనుటయే కష్టము. గర్భధారణవలన కలిగిన వ్యాధులవలన స్త్రీమరణించుచో దానికి తమబాధ్యత మిక్కిలి తక్కువగా నుండునని కంపెనీవారు ప్రకటింతురు. ఈనియమము ఎంతకాలమువఱకైనను పొడుగింపబడవచ్చును. అందుచేతనే ఈనియమము అందరియందును అనుమానమును రేపజాలినదిగనున్నది. కావుననే భారతస్త్రీ ఇన్సూరెన్సు కంపెనీవారి సహాయమును అర్థించుటకు ఉత్సాహమును కనబఱచుటలేదు. అంతయు విధికి వదలివేయుచున్నది.

కొన్ని ఇన్సూరెన్సు కంపెనీలు స్వయముగ ఉద్యోగముచేయుచు స్వతంత్రముగ ధనసంపాదనచేయుచున్న స్త్రీల జీవితములను మాత్రమే భీమాచేయుటకు అంగీకరించుచున్నవి. మగని ఆర్జన, పూర్వార్జిత సంపద పెట్టుకొనియుండు గృహిణులకు ఇందుమూలమున ఇన్సూరెన్సువలని లాభములను పొందుటకు వీలులేక పోవుచున్నది. ఇది మిక్కిలి శోచనీయము. పురుషుడు ఉద్యోగిఅయినను పూర్వార్జితముమీద జీవించువాడైనను భీమా సౌకర్యము పొందుటకు వీలుండగా స్త్రీకి ఒక్క ఉద్యోగములో ఉండిననే భీమా సౌకర్యము పొందగలుగు యోగ్యత యుండుట విచిత్రమైనది.

ఇన్సూరెన్సు విషయమున ఇన్ని నిరోధములు స్త్రీలకు కల్పింపబడియున్నవి. స్త్రీలకు ప్రస్తుతకాలమున ఇన్సూరెన్సు కంపెనీలు దుర్లభములుగా నున్నవి. ప్రాయకముగా ఇన్సూరెన్సు కంపెనీలన్నియు పురుషుల యాజమాన్యమున, నిర్వాహణమున ఉండుటచేతనే స్త్రీలకిట్టి అన్యాయము జరుగుటకు మార్గము ఏర్పడినదా?

స్త్రీలు ఈవిషయమున మాంద్యతను వీడి ముందుకువచ్చి తీవ్రతరముగు ఆందోళనము సాగించి తమకును పురుషులతో సమానమగు హక్కును సంపాదింపవలసియున్నది.

—శ్రీమతి సత్యబాల సుశీలాదేవి.

[ఈ వ్యాసకర్త్రి స్త్రీల జీవితభీమా విషయమున వెలువరచిన అభిప్రాయములు చర్చనీయములై యున్నవి. ఇతర ఇండియన్ కంపెనీలమాట ఎట్లున్నను తెనుగువారి భీమాకంపెనీలలో స్త్రీల జీవితభీమా విషయమునగల నియమములను ఒకపరి పర్యాలోచింపవలసియున్నది. తెలుగు భీమాకంపెనీలలో స్త్రీల జీవిత భీమా విషయమున బెజవాడయందలి డెక్కన్ అస్యూరెన్సు కంపెనీవారు చూపిన సౌకర్యములను ఈవ్యాసకర్త్రి గమనించినట్లు లేదు.]




## ౯౦. ప్రకృతి గృహవైద్యము

ప్రకృతి, ఇండియన్ నాచురోపాత్ పత్రికా సంపాదకులును; సువిశితవైద్యము, కోట్టివైద్యము మొదలగు సుప్రసిద్ధ గ్రంథరచయితలునగు పుచ్చా వెంకట్రామయ్యగారు, ఎన్. డి. రచియించినది. ప్రకృతి పత్రికనుండి పునర్ముద్రింపబడినది. డబుల్ క్రౌన్ సైజున 200 పుటలు. వెల ప్రతి 1 టికి రు 2-8-0. ప్రకాశకులు : ప్రకృతి కార్యాలయ ట్రస్టు, బెజవాడ. ప్రకృతివైద్యమును అభ్యసింప దలచినవారికి ఇందు ప్రారంభపాఠములు చెప్పబడినవి. సామాన్య ప్రకృతి వైద్యజ్ఞానమును పొందదలచిన తెనుగువారు అవశ్యము పఠింపవలసిన గ్రంథమిదియొక్కటియే యనుట మఱువరానిది. ఇందు ఇరువదినాలుగు పాఠములుకలవు. మొదటి రెండు పాఠములందును అస్థినిర్మాణము వివరింపబడినది. మూడవ పాఠమున దేహమునందలి అవయవములు బోధింపబడినవి. నాలుగు, ఐదు, ఆరు పాఠములు క్రమముగా రోగము, రోగనిదానము, రోగచిహ్నములు వీనిని తెలుపునవిగానున్నవి. ఏడవ పాఠమున చెప్పబడిన ప్రత్యేకవ్యాధులు : వానిచికిత్స శ్రద్ధతో చదువ తగినదై యున్నది. ఎనిమిది, తొమ్మిది, పది పాఠములు ఆహారశాస్త్రమును అరటిపండు ఒలచినరీతిని బోధించుచు ప్రతివారికిని పఠనీయములై యున్నవి. పదునొకండవ పాఠమున మర్దనచికిత్స, పంద్రెండవ పాఠమున చలనచికిత్స ప్రస్తరింపబడినవి. పదమూడవ పాఠమున వ్యాయామము కొత్తరీతులతో బోధింపబడినది. పదునాలగవ పాఠమున నీటివైద్యము, పదునేనవ పాఠమున విద్యుద్వైద్యము, పదునారవ పాఠమున సూర్యకిరణచికిత్స దిఙ్మాత్రముగ చేర్పబడినవి. పదునేడవ పాఠమున మాత్రపరీక్ష-మాత్రముతీయుట చెప్పబడినవి. కాని ఇవి చెప్పబడవలసినంత విపులముగా చెప్పబడలేదని మావమ్మకము. పదునెనిమిది, పందొమ్మిది, ఇరువది, ఇరువది ఒకటి పాఠములు నాలుగును కశేరుకాచికిత్సకు-అనగా వెన్నెముకయందు కలిగిన లోపములను సరిచేయు చికిత్సకు- వినియోగింపబడినవి. ప్రకృతి గృహవైద్యమున ప్రథమపాఠముగా పరిగణింప నుద్దేశింపబడిన ఈగ్రంథమున కశేరుకాచికిత్సకు ఇంత ప్రాముఖ్యము ఏల ఈయబడినదో తెలియుటలేదు. ఇరువది రెండు, ఇరువదిమూడు పాఠములు అస్థిచికిత్సను బోధించునవి. ఇరువదినాలుగవ పాఠము మానసికచికిత్సను చేర్పునది. ఇది చాల ముఖ్యమైనపాఠము. కంటికి కనిపించని మనస్సులోని రోగములను వైద్యుడు తన మానసికశక్తివలనను, కాంతశక్తివలనను, తన మీద రోగికి ఉండు గౌరవమువలనను కుదుర్చుటను చేర్పు పాఠమగుట ఇది మిక్కిలి శ్రద్ధతో చదువ తగినదై యున్నది. విషయవివరణమునకు అవసరమైన చోట్ల చిత్రములు చేర్పబడి గ్రంథప్రాశస్త్యమును ఇనుమడింప చేసినవి. ఆరోగ్యవిజ్ఞానమును కలిగించు ఈ గ్రంథమునందలి వాక్యములు కొన్ని స్థలాంతరమున ముద్రించినారము.

## ౯౧. భిషగ్రత్నసమ్మానము

సుప్రసిద్ధాయుర్వేద వైద్యులును, కాకినాడ తాలూకా పల్లెపాలెమునందలి ధర్మవైద్యాశ్రమ స్థాపకులును అగు మధునాపంతుల సత్యనారాయణమూర్తి గారికి జరిగిన సమ్మానమును వివరించు గ్రంథమిది. ప్రకాశకులు : రేమెళ్ళ వేంకటరాయనింగారు.

Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.



సీ. చంద్రఖండకలాపుఁ జారువామనరూపుఁ
గలితచంచలకర్ణుఁ గనకవర్ణు
మోదకోజ్జ్వలబాహు మూషికోత్తమవాహు
భద్రేభవదను సద్భక్తసదను
సన్మునిస్తుతిపాత్రు శైలసంభవపుత్రు న
నుదినామోదు విద్యాప్రసాదుఁ
బరశువరాభ్యాసు బాశాంకుశోల్లాసు
నురుతరఖ్యాతు నాగోపవీతు
లోకసన్నుత గుణవంతు నేకదంతు,
నమితహేరంబు సత్కరుణావలంబు
విమలరవికోటితేజు శ్రీవిఘ్నరాజుఁ,
బ్రథితవాక్ప్రౌఢి కెక్కఁగఁ బ్రస్తుతింతు.

— మొల్లరామాయణము.



# 40 ఔన్సుల నెత్తురు

40 ఔన్సుల రక్తమునుండి కాని ఒక ఔన్సు శుక్లము ఉత్పత్తి కాదని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. దీనినిబట్టి శుక్లము ఎంత విలువైనదో తెలిసికొనవచ్చును. అట్టి శుక్లము మూత్రములోగాని, స్వప్నములోగాని పోవుచున్నచో ఇక పురుషునకు ఇహలోక సుఖమెక్కడ! కాబట్టి సుఖానందములపై దృష్టియున్నచో

## శుక్లనష్టమును

ఎంతమాత్రమును అశ్రద్ధచేయక వెంటనే చికిత్సచేసి శుక్లరక్షణము గావించుకొనవలయును. పలుచబడిన వీర్యమును గట్టిపఱచి అమితముగా వీర్యవృద్ధిని కలిగించు వనమూలికలకు రాజైన రత్నపురుష

ప్రధానద్రవ్యముగా చేయబడిన

# రత్నపురుషలేహ్యము

క్రమముగా సేవించుటచే తప్పక శుక్లరక్షణము జరుగును. మరియు ఈరత్నపురుషలేహ్యసేవనమువలన

కండపుష్టి : కాయపుష్టి

బలము : ఆరోగ్యము

శరీరబింకం : జీవితసౌఖ్యం

పొందుదురు. రత్నపురుషతో అమోఘవీర్యములగు పెక్కు ఇతర వనమూలికలుచేర్చి తయారుచేయబడిన తియ్యని రసాయనము. శుక్లనష్టమును నూటిగ కుదుర్చు మధురమగు మందు. మేహరోగుల పాలిటి వరప్రసాదము.

నెలకు ఒక పౌను. వెల రూ. 3-0-0. తపాలాఖర్చులు ప్రత్యేకము.

## రత్నపురుష డిపో,

2/40 పెద్దినాయునివీధి,

మదరాసు.